# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు

★



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.

★

విడి ప్రతి
**75** పైసలు

సంవత్సర చందా
రూ. **9/-**

వస్తోంది!

యస్.వి.ఆర్. ఫిలిమ్సు

# బాంధవ్యాలు

దర్శకత్వం: యస్.వి.రంగారావు B.Sc.,

నిర్మాతలు
బడేటి సత్యనారాయణ
పుట్టా వెంకట్రావు

మాటలు
డి.వి. నరసరాజు

సంగీతం
యస్. హనుమంతరావు

కెమేరా
చంద్రశేఖర్ ఎ. సింగ్

అసోసియేట్ డైరెక్టర్
కె.వి. నందనరావు

పూర్ణా రిలీజ్

















# బంగారు కవరింగ్
# రాజా










ఆభరణములు ధరించండి.










జ్యువెలర్లకు, నగలకు. హోల్‌సేలుకు వ్రాయండి.




2-4" SIZE Rs. 10-00. 2-2 SIZE Rs. 9-00 PER PAIR.

**రాజా గోల్డు కవరింగ్ వర్క్స్** (REGD) POST BOX No. 38. H.O. మచిలీపట్నం.

నెల్లూరు-కలుగవర్దరుపేట విజయవాడ 2-మెయిన్‌బజారు ఏలూరు-చిక్కడపల్లి హైదరాబాద్ 20.

---




## పొదుపునకు...

ప్రకాశవంతంగా, పరిశు-
భ్రంగా చిరకాలం, పొదు
పుగా పని చేసే లాంపు.

ఎల్లపుడును వాడండి

# బెంగాల్

ఇండియాలో శ్రేష్టమైనది
బెంగాల్స్ కొయిల్డ్ కాయిల్ లాంపులే
ఎల్లవుడు వాడండి. నమ్మకమైనది.

మీకు చల్లని, ప్రకాశవంత
మైన వెలుగునిచ్చే లాంపు

బెంగాల్ **హంస**

పాలతెలుపు లాంపు.




ఆంధ్రప్రదేశ్‌కు సోల్ సెల్లింగ్ ఏజెంట్లు:
**జి.ఎ. పరశురామ్ & కంపెని.**
11-4-658/2, లకడికాపూల్. హైదరాబాద్. 4. A.P.

బెంగాల్ ఎలెక్ట్రికల్ కంపెని, బెంగళూరు-3 & మదరాసు-17

# ఒకడజను యింత చక్కని ఫోటోలు తీయండి




# ...కెమెరా కొన్న రోజునే Agfa క్లిక్ III

మొదలు పెట్టుటకు శ్రేష్ఠమే
వదలి పెట్టుట కష్టము!

* గురిపెట్టి క్లిక్ చెయ్యండి. చిక్కు పెట్టే సాధనా లేమీ లేవు. పొరబాట్లు చేసే అవకాశం లేదు.
* 120 సైజు రోలు ఫిల్ముమీద 12 పెద్ద (6×6సెం. మీ) ఫోటోలు తీయవచ్చు.
* ఎవరెడీ కేసు పోర్ట్రెయిట్ లెన్సు, యింకా ఫ్లాష్ గన్ అదనంగా కొనుక్కోవచ్చు.



కళ కళ లాడే ప్రింట్లకు,
ఎన్‌లార్జ్‌మెంట్లకు అగ్ఫా ఫోటో
పేపర్లు మాత్రమే కావాలని అడగండి

అగ్ఫా పర్యవేక్షణ క్రింద తయారుచేయువారు : ది న్యూ ఇండియా ఇండస్ట్రీస్ లిమిటెడ్, బరోడా.



ఆగ్ఫా-గెవర్టు, ఇండియా లిమిటెడ్
బొంబాయి • న్యూఢిల్లీ • కలకత్తా • మద్రాసు

CNAG-103 203 TL



# పిల్లవాని వయస్సు 5 ఏళ్లు మాత్రమే

—కాని యిప్పటినుండే సంపాదన ప్రారంభించేడు!

పిల్లవాడు బుద్ధిమంతుడు అయినా, కాక పోయినా వాని తల్లి తండ్రులను అభినందించక తప్పదు. ఎందుకంటె, వారు పిల్లవాని క్రిందటి జన్మదినము నాడు వానికి ఎంతో మంచి బహుమానమును యిచ్చేరు. అదేమిటంటే, బ్యాంక్ ఆఫ్ బరోడాలో పిల్లవాని పేర వారు ఒక మైనర్స్ సేవింగ్స్ అక్కౌంటును ప్రారంభించేరు.

పిల్లవాడు పెరిగి పెద్దవాడై డాక్టరు, ప్లీడరు లేక ఇంజినీరు వంటి పెద్ద చదువులకు వెళ్లాలనుకోవచ్చును. ఆ సమయములో అవసరమునకు ఎక్కువ డబ్బు నిలవ వుంటుంది.

ది బ్యాంక్ ఆఫ్ బరోడా లిమిటెడ్ మీ పిల్లవాని భవిష్యత్తుకు నిలవచేయడములో మీకు సహాయపడుతుంది. నేడే మీ పిల్లవాని పేర ఒక మైనర్స్ సేవింగ్స్ అక్కౌంటును ప్రారంభించండి!

- మీరు మైనర్స్ సేవింగ్స్ అక్కౌంటును రు. 1 అంత తక్కువతో ప్రారంభించి 3½% వడ్డీ సంపాదించకోవచ్చును!
- ఈ అక్కౌంటును మీ పిల్లవానికి 14 ఏళ్ల వచ్చే వరకు మీరు నిర్వహించవచ్చును. తరువాత దానిని వాడే స్వంతంగా నిర్వహించుకోవచ్చును. ఇలా, మీ పిల్లవానికి నిలవచేయడములో శిక్షణ లభిస్తుంది.

సిరి సంపదలకు అక్షయపాత్ర



**ది బ్యాంక్ ఆఫ్ బరోడా లిమిటెడ్**

(స్థాపితం 1908)
రిజిస్టర్డ్ ఆఫీసు : మాండ్వి, బరోడా.
మన దేశములో మరియు విదేశములో
300 పైగా బ్రాంచీలు కలవు

'దయచేయండి మీకు సాయపడతాం' అనే కరపత్రం ఉచిత కాపీని కోరండి. మా సేవం గురించి మీకు పూర్తి వివరాలు దొరుకుతాయి.

shilpi bob 12/67A TEL

ఏప్రిల్ 26 మొదలు!

జెమినీ వారి

# భలే కోడళ్లు

కథ.దర్శకత్వం.. కె. బాలచందర్

మాటలు: భమిడిపాటి రాధాకృష్ణ · పాటలు: సి. నారాయణరెడ్డి
సంగీతం: ఎం.ఎస్. విశ్వనాథన్



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

"వమాయరోగం" [బేతాళ కథ] అజ్జరపు హనుమంతరావు పంపిన కథ. లౌక్యమూ, వంచనా దుష్ఫలితాలకు దారితీస్తాయని మనం ఈ కథ నుంచి తెలుసుకుంటాం.

"సుల్తాను తీర్పు" అన్న కథలో ఒక విచిత్రమైన తిరుగుడున్నది. ఒక దుర్మార్గుడు ఒక నేరం చేసినప్పుడు సుల్తాను వాడి చేత మరొక నేరం కూడా చెయ్యనిచ్చి, అన్యాయం జరిగినవాడికి మరింత మేలు చేస్తాడు!

సంపుటి 42 మే '68 సంచిక 5



# భారత చరిత్ర



నానా ఫడ్నవిస్ హయాంలో మహారాష్ట్రుల ప్రతిష్ఠ ఉన్నతికి వచ్చింది. కాని అది దక్కలేదు. ఫడ్నవిస్ నియంతృత్వానికి తట్టుకోలేక పేష్వా మాధవరావు నారాయణ 1795 అక్టోబరు 25 న ఆత్మహత్య చేసుకున్నాడు. అతని అనంతరం పేష్వా అయిన రెండవ బాజీరావు (రఘోబా కొడుకు) నానా ఫడ్నవిస్‌కు ప్రబల విరోధి. ఎన్నో కుట్రలూ, కుహకాలూ జరిగిన పిమ్మట 1796, డిసెంబరు 4 న ఒక విధమైన రాజీ కుదిరింది; రెండవ బాజీరావు పేష్వాగానూ, నానా అతని ప్రధానిగాను నిర్ధారణ అయింది.

రెండవ బాజీరావుకు యుద్ధతంత్ర ప్రావీణ్యం ఏమీ లేకపోయినా, పిల్లి మీద ఎలుకనూ, ఎలుక మీద పిల్లినీ ఎక్కించే నేర్పు చాలా ఉన్నది.

1798 ఏప్రిలు 26 న లార్డ్ వెలస్లీ గవర్నరు జనరల్‌గా వచ్చాడు. ఇతను ఆరితేరిన సామ్రాజ్యవాది. అతను బ్రిటిషు సామ్రాజ్య పరిరక్షణమే లక్ష్యంగా పెట్టుకుని తన విధానాలను రూపొందించాడు. అతను భారతదేశంలో గల అనేక రాజ్యాలకు సైనిక సహాయం ఆశ పెట్టి, కొన్ని కొన్ని ప్రాంతాలు కంపెనీ అధీనంలో ఉంచటానికీ, సైన్యపు ఖర్చులు వసూలు చెయ్యటానికీ ప్రయత్నించాడు. నిజాములాటి దుర్బలులు ఈ ఎరను తేలికగా మింగారు. మహారాష్ట్రులు మటుకు వెలస్లీకి జవాబు కూడా ఇవ్వలేదు.

కాని, 1800 మార్చి 13 న నానా ఫడ్నవిస్ పూనాలో మరణించటంతో మహరాష్ట్ర వ్యవహారాలలో ఇంగ్లీషువారు చెయ్యి పెట్టే అవకాశం చిక్కింది. నానా ఫడ్నవిస్‌కు ఇంగ్లీషువారంటే ఎంత గౌరవం ఉన్నా, రాజకీయంగా వారిని విషం కింద జమకట్టుతూ వచ్చాడు. కొండలాటి నానా పోగానే మహారాష్ట్ర నాయకుల మధ్య స్పర్ధలు

## 80. మహారాష్ట్రుల పతనం





మిన్నుముట్టాయి. పూనా గద్దె కోసం దౌలత్ రావు సింధియా (మహాదాజీ పెంపుడు కొడుకు), జస్వంతరావు హెూల్కరూ (తుకోజీ సొంత కొడుకు) ఒకరిపై ఒకరు కత్తులు కట్టారు. మాల్వా వద్ద సింధియా, హెూల్కరు సైన్యాలతో పోరుతూ ఉన్న సమయంలో, పేష్వా జస్వంతరావు సోదరుడైన విఠూజీని హత్య చేశాడు. ఆగ్రహావేశంలో జస్వంతరావు, సింధియా సేననూ, పేష్వా సేననూ కలిపి చిత్తుగా ఓడించి, పూనాను పట్టుకున్నాడు (అక్టోబరు 23). పేష్వా అక్కడికీ, ఇక్కడికీ పరుగులు తీసి, చిట్టచివరకు బసీన్‌లో తలదాచుకున్నాడు.

ఈ స్థితిలో రెండవ బాజీరావు ఇంగ్లీషు వారి సహాయం అర్థించాడు. మహారాష్ట్రుల వ్యవహారాలలో తలదూర్చే అవకాశం గవర్నరు జనరలు వెలస్లీకి ఈ విధంగా దొరికింది. 1802 డిసెంబరు 31న బసీన్ ఒడంబడిక పైన సంతకం చేసి రెండవ బాజీరావు ఇంగ్లీషువారి సహాయం పొందాడు. ఈ ఒడంబడిక ప్రకారం పేష్వా కింద ఉన్న భూభాగంలో 6000కు తక్కువగాని కాల్బలమూ, దానికి అనుగుణమైన ఫిరంగులూ, యూరోపియన్ ఫిరంగి దళంవాళ్ళూ శాశ్వతంగా ఉంచబడతారు; ఈ సేనల ఖర్చు కింద పేష్వా 26 లక్షల రాబడి గల ప్రాంతాలను ఇంగ్లీషువారికి సమర్పించాలి.

1803 మే 13న బ్రిటిషు సేనలు రెండవ బాజీరావును సింహాసనం మీద తిరిగి కూర్చోబెట్టాయి.

ఇంగ్లీషువారి దృష్టినుంచే చూసినా బస్సీన్ సంధి ఒడంబడికలో ఒక పెద్ద లోపం ఉన్నది—దానిపై సంతకం పెట్టినవాడు పరమ అప్రయోజకుడైన రెండవ బాజీరావు. అతని సంతకానికి తోలి విలువ లేదు. ఈ సంధి మహారాష్ట్ర నాయకులందరికీ ఆగ్రహం తెప్పించింది. తమ జాతికే అవమానం జరిగినట్టు భావించి, పరస్పర

విద్వేషాలను పక్కకు నెట్టి, వారంతా ఏకమై, బ్రిటిషువారిని ప్రతిఘటించ యత్నించారు.

మొట్టమొదట దౌలత్‌రావు సింధియా, రెండవ రఘూజీ భోంస్లే (బిరారు) ఏకమయారు. వారు జస్వంతరావు హెూల్కర్‌ను కూడా తమ పక్షం కమ్మని ఆహ్వానించారు. కాని అతను వారితో చేరక, వారి ఉద్యమం ఎలా పరిణమించేది చూసి ఒక నిర్ణయానికి రావాలనుకుని, తీరా తరుణం మించిపోయాక రంగంలోకి దిగాడు.

1803 ఆగస్టులో మహారాష్ట్రులకూ, ఇంగ్లీషువారికీ యుద్ధం ప్రారంభమయింది. మహారాష్ట్ర సేనలో 250,000 మంది సైనికులూ, ఫ్రెంచివారి చేత శిక్షణ పొందిన 40 వేల మంది సైనికులూ ఉన్నారు. అయితే ఇంగ్లీషువారు కూడా యుద్ధానికి తగిన విధంగానే అయత్తమయారు. అనేక రంగాలలో యుద్ధం సాగింది. ప్రధాన రంగాలు దక్కనులోనూ, హిందూస్థానంలోనూ ఉన్నాయి. గుజరాతూ, బుందేల్‌ఖండూ, ఒరిస్సాలలో చిన్న రంగా లున్నాయి. అన్ని రంగాలలోనూ ఇంగ్లీషువారే గెలిచారు. అయిదు మాసాలు గడిచేలోపుగా సింధియా, భోంస్లేలు అనేక అపజయాలు పొంది, చెరొక సంధీ చేసుకున్నారు. 1803 డిసెంబరు 17న జరిగిన దేవగాం సంధితో బిరారు పాలకుడైన భోంస్లే కటక్ మండలాన్ని, బలాసోర్‌నూ, వర్ధానదికి పశ్చిమంగా ఉండే తన యావత్ రాజ్యాన్ని కోల్పోయాడు.

డిసెంబరు 30న సింధియా ఇంగ్లీషు వారితో సుర్జిఅర్జునగాం వద్ద సంధి చేసుకుని, ఇంగ్లీషువారికి గంగా యమునల మధ్య.తనకు గల రాజ్యమంతా సమర్పించి, జయపూర్, జోధ్‌పూర్, గోహద్‌లకు ఉత్తరంగా ఉన్న రాజ్యాన్ని, పశ్చిమాన అహమ్మద్‌నగర్‌నూ, భ్రోచ్‌ని, అజంతా కొండల దాకా ఉన్న తన రాజ్యాన్ని, తనకు గల వివిధ హక్కులనూ కోల్పోయాడు.





# దయ్యాలతో వ్యాపారం

ఒక గ్రామంలో ఒక పేదరైతుకు ఇద్దరు కొడుకులుండేవారు. పెద్దవాడు రామన్న, చిన్నవాడు వీరన్న. రామన్న కలిగిన ఇంటి పిల్లను చేసుకోవటంచేత అతనికి కొంత వరకు జరుగుబాటు అవుతూ వచ్చింది. కాని వీరన్న బొత్తిగా పేదింటి పిల్లను చేసుకున్నాడు. భార్యతరవున అతనికి చిల్లి గవ్వ కూడా రాలేదు. అందుచేత అతనికి పూట గడవటం చాలా కష్టమయింది.

తన భార్య సలహా మీద వీరన్న, పప్పులూ, బొరుగులూ, జంతికలూ, మిఠాయి ఉండలూ లాటి చిరుతిండి పదార్థాలు ఇంట్లో తయారు చేయించి, గంపలో పెట్టుకుని, సమీపంలో ఉండే బస్తీకి వెళ్ళి; వాటిని అక్కడ అమ్మి, అలా తెచ్చిన డబ్బులతో కాలక్షేపం చేస్తూవచ్చాడు.

ఒక రోజు వీరన్న గంపలో తీసుకుపోయిన సరుకు సగం కూడా అమ్ముడవలేదు. ఆ రోజు ఏదో పండగ. బస్తీలో వాళ్ళందరూ ఇళ్ళలోనే ఉండి పిండి వంటలు చేసుకుని ఉండటంచేత వీరన్న తెచ్చిన సరుకుకు గిరాకీ లేకపోయింది. చీకటి పడినదాకా బస్తీలోనే ఉండి, అమ్ముడు కాని సరుకు నెత్తిన పెట్టుకుని వీరన్న ఇంటిముఖం పట్టాడు.

అతను తన గ్రామం వెలపల ఉన్న శ్మశానానికి చేరుకునేసరికి బాగా చీకటి పడిపోయింది. ఆ చీకట్లో ఏవే అస్పష్టమైన ఆకారాలు కదులాడుతూండటం చూసి, అవి దయ్యాలై ఉంటాయని వీరన్న గ్రహించాడు. అయితే వీరన్న చాలా ధైర్యం గలవాడు. అందుచేత అతను ఒక చెట్టు కింద గంపను దించి కూర్చుని, పెద్దగా గొంతెత్తి, "పప్పులు, బొరుగులు, పొంగరాలు, జంతికలు!" అని దయ్యాలను ఆకర్షించటానికి కేక పెట్టాడు.

ఎస్. చంద్రశేఖర్



వెంటనే దయ్యాలు అతని చుట్టూ మూగి, "మాకిస్తావా?" అని అడిగాయి.

"మీ కోసమే తెచ్చాను. తినండి," అన్నాడు వీరన్న.

దయ్యాలు అతని గంపలో చేతులు పెట్టి, మిగిలిపోయిన సరుకంతా తినేసి, "భలే బాగున్నాయి! రోజూ ఇటువంటి తినుబండారాలు పట్టుకు రారాదా?" అని అడిగాయి.

"మీరు తింటా ననాలే గాని ఎందుకు పట్టుకురానూ?" అన్నాడు వీరన్న. అతనా పూటకు ఖాళీ గంపతో ఇంటికిపోయి, "ఇక నుంచీ నేను దయ్యాలతో వ్యాపారం చెయ్య బోతున్నాను. వాటిని మంచి చేసుకుంటే ఎంత లాభమైనా ఉంటుంది," అని తన భార్యతో అన్నాడు.

వీరన్న భార్య ఏమీ అభ్యంతరం చెప్ప లేదు. మర్నాడు ఆమె గంపనిండా చిరు తిళ్ళు నింపింది. బాగా చీకటిపడేదాకా ఆగి, వీరన్న ఆ గంపను నెత్తిన పెట్టుకుని శ్మశా నానికి వెళ్ళాడు. దయ్యాలు అతనిచుట్టూ మూగి, క్షణంలో గంప ఖాళీ చేశాయి.

అప్పుడు వీరన్న వాటితో, "చూడండి, తమ్ముళ్ళూ! నేను వ్యాపారం చేసుకునే వాణ్ణి. అంటే, డబ్బు తీసుకుని ఈ వస్తు వులు అమ్ముతూంటాను. మీరు కూడా నాకు డబ్బు ఇస్తూ ఉన్నట్టయితే మీకి ఫలహా రాలు తెచ్చి పెట్టగలను. లేకపోతే నా వల్ల కాదు," అన్నాడు.

"నీకు డబ్బులే కదా కావాలి? ఇక్కడే ఉండు," అంటూ దయ్యాలు చెల్లాచెదు రుగా ఎటో వెళ్ళిపోయి, కొద్ది సేపట్లో డబ్బులు తెచ్చి గంప నిండా పోశాయి; పోసి, "నువు మాత్రం రోజూ వస్తూండాలి. నీ కోసం రోజూ ఎదురు చూస్తూ ఉంటాం," అని చెప్పాయి.

వీరన్న వాటితో సరేనని చెప్పి, గంప నెత్తిన పెట్టుకుని ఇంటికి వెళ్ళాడు. గంపలో

ఉన్న డబ్బంతా చూసి అతని భార్య సంతోషం పట్టలేక, "ఓయమ్మో! ఇంత డబ్బే!" అన్నది.

"నేను చెప్పలేదా? దయ్యాలతో వ్యాపార మంటే ఏమిటనుకున్నావు? ఇక మనం ఏ పనీ చెయ్యకుండా, బతికున్నంత కాలమూ కాలిమీదకాలు వేసుకుని రాజాగా బతకొచ్చు. ఈ దెబ్బతో మన దరిద్రం తీరి పోయింది!" అన్నాడు వీరన్న.

తన తమ్ముడు అకస్మాత్తుగా ధనవంతు డైపోయి పొలాలూ, పశువులూ కొనటం చూసి రామన్న నిర్ఘాంతపోయాడు. అతను వీరన్న ఇంటికి వచ్చి, "ఒక్కసారిగా ఇంత డబ్బు నీ కెక్కడిదిరా? నీ రహస్యం ఏమిటో కాస్త నాకూ్కడా చెబుతావా?" అని అడిగాడు.

వీరన్న రామన్నతో జరిగిన దంతా వివరంగా చెప్పాడు.

"దయ్యాలతో వ్యాపారం బాగుందిరా! నేను కూడా ఈ పనే చేసి నీలాగే ఇంత డబ్బు సంపాదిస్తా నుందు," అన్నాడు రామన్న సంతోషంగా.

ఆ రాత్రే అతను కూడా ఒక గంప నిండా చిరుతిళ్ళు నింపుకుని శ్మశానానికి బయలు దేరిపోయాడు.



అన్నకు తగినంత ధైర్యం ఉంటుందో లేదో నని వీరన్నకు అనుమానం కలిగింది. అవసరమైతే దయ్యాలను హడలగొట్టటానికి కూడా అతను ఒక ఎత్తు ఆలోచించాడు. అన్న శ్మశానానికి బయలుదేరిన కొద్దిసేపటికి వీరన్న కూడా ఇంత చమురూ, అగ్గిపెట్టె తీసుకుని శ్మశానానికి బయలుదేరాడు. శ్మశానానికి దగ్గరలో ముళ్ళకంప ఉంటే అందులో చమురు చల్లాడు.

ఈ లోపల రామన్న శ్మశానం చేరు కున్నాడు. అతను రాగానే దయ్యాలు అతన్ని చుట్టుముట్టి, "రోజూ వస్తానని మాట ఇచ్చి ఏమైపోయావ్?" అంటూ

రామన్నను కోపంకొద్దీ రకరకాల హింసిం చసాగాయి.

ఈ సమయంలో వీరన్న పరిగెత్తుకుంటూ వచ్చి, "అతన్నేమీ చెయ్యకండి. ముందు మీకు తినుబండారాలు పెట్టినది అతను కాదు, నేనూ!" అన్నాడు.

దయ్యాలు రామన్నను వదిలి వీరన్నను చుట్టుముట్టి, "అయితే నువ్వు రోజూ ఎందుకు రావటం లేదూ?" అని అడిగాయి.

"ఇంతేనా మీకు తెలిసింది? నేను రోజూ వస్తూనే ఉన్నాను. మధ్య దారిలో ఇంకేవో దయ్యాలు అడ్డపడి నే తెచ్చిన సరుకంతా తినేస్తున్నాయి. నేనేం చేసేది?" అన్నాడు వీరన్న.

"అదా సంగతి? ఏవీ అవి? మాకు చూపించు! వాటి అంతు తేలుస్తాం!" అన్నాయి దయ్యాలు.

"రండి," అంటూ వీరన్న దయ్యాలను, తాను ముందుగా చమురు చల్లివచ్చిన కంప దగ్గిరికి తీసుకుపోయి, "ఇందులో ఉన్నాయి," అన్నాడు.

దయ్యాలు ముందూ వెనకా చూడకుండా కంపలోకి దూకాయి. మరుక్షణమే వీరన్న నిప్పుపుల్ల వెలిగించి కంప అంటించాడు. అతను చల్లిన చమురు మూలంగా కంపంతా ఒక్కసారిగా భగ్గున మండింది. ఆ అదురుతో దయ్యాలు ఆ చాయల ఎక్కడా లేకుండా పారిపోయాయి. ఆటుతరవాత శ్మశానంలో కూడా ఎవరికీ అవి కనిపించలేదు. ఊరికి దయ్యాల బెడద వదిలిపోయింది.

వీరన్న తన అన్నను ఇంటికి తీసుకుపోయి, "ఫరవాలేదులే, అన్నా. మన ఇద్దరి అన్నులూ కలబోసుకుంటే మన జీవితాలు హాయిగా వెళ్ళిపోతాయి," అన్నాడు.

అన్నదమ్ము లిద్దరూ కలిసి జీవించి తాము సుఖంగా బతకటమే కాక, కొద్ది కాలంలోనే తమ సంపదను కూడా చాలా రెట్లు పెంచుకున్నారు.





# శిథిలాలయం

## 5

[ పూజారి అనుచరులు పెట్టిన మాటులో నుంచి బయటపడిన శిఖిముఖి దగ్గిరకు విక్రమ కేసరి వచ్చాడు. అప్పుడు ఆ ఇద్దరూ కలిసి దొంగలను వెతుకుతూ కొండప్రాంతాలకు వెళ్ళారు. అక్కడ త్రిశూలం పట్టుకునివున్న ఒక పెద్ద కొయ్యబొమ్మ కనిపించింది. దాని కిందుగా ఎర్రగండు పరిగెత్తేంతలో త్రిశూలం వేగంగా కిందికి దిగసాగింది. తరవాత—]

కొయ్యబొమ్మ చేతులు కదిలినప్పుడు కలిగిన అతి స్వల్పమైన ధ్వనిని ఎర్రగండు వినగలిగింది. వెంటనే అది ఒక్క దూకున బాణంలా ముందుకు దూసుకు పోయింది. మరుక్షణం బొమ్మ చేతిలోని త్రిశూలం బలంగా నేలను తాకింది. శిఖిముఖి, విక్రమ కేసరీ నివ్వెరపోయారు.

"ఇది కొయ్యబొమ్మ కాదు, రాకసి బొమ్మ! ఎర్రగండు ప్రాణాలు దక్కించుకున్నది. అదృష్టం కొద్దీ మనం కూడా చావు తప్పించుకున్నాం," అన్నాడు విక్రమకేసరి.

శిఖిముఖి కొయ్యబొమ్మను సమీపించి, దాన్ని జాగ్రత్తగా పరీక్షించి చూస్తూ, "ఇది శిథిలాలయ పూజారి మన కోసం పెట్టిన మాటు. కాని, మన కంటె ముందుగా ఎవడో నిర్భాగ్యుడు యీ దారి వెంట ముందుకు పోయి, దీని చేతిలోని త్రిశూలం వల్ల గాయపడటమో, మరణించటమో జరి



గింది. త్రిశూలాన్ని అంటి వున్న నెత్తురు సూర్యకాంతిలో ఎలా మెరుస్తున్నదో, చూశావా!" అన్నారు.

విక్రమకేసరి ఆ రాక్షసిబొమ్మ కాళ్ళలో ఒకదాన్ని ఈటెతో పొడిచి చూశాడు. బొమ్మ కొంచెంగా కదుల్లాడింది. అతడు శిఖిముఖి కేసి తిరిగి, "శిఖీ! మనం దీన్ని తేలిగ్గా పడకొట్టగలం అని నాకు తోస్తున్నది. దీన్ని యిలాగే వుండనివ్వటం ప్రమాదకరం. మన వాళ్ళు అజాగ్రత్తగా దీని కిందుగా నడవటం జరిగితే చావు తప్పదు," అన్నాడు.

శిఖిముఖి ఆ మాటలకు అవునన్నట్టు తల వూపి, అక్కడికి సమీపంగా వున్న ఒక పెద్ద రాతిని విక్రమకేసరికి చూపుతూ, "మనం యిద్దరం దాన్ని కదిలించగలం అనుకుంటాను. పట్టు పట్టి ఆ రాయిని కొయ్యబొమ్మ కాళ్ళ మీదికి నెట్టగలిగామంటే, అది కుప్పలాగా కూలటం ఖాయం," అన్నాడు.

ఆ వెంటనే శిఖిముఖీ, విక్రమకేసరీ బండరాయిని బలంగా పట్టుకుని వున్న చోటు నుంచి కదిలించి, విసురుగా దాన్ని కొయ్యబొమ్మ కాళ్ళ కేసి నెట్టారు. రాయి దొల్లుకుంటూ పోయి బొమ్మ కాళ్ళల్లో ఒక దాన్ని ఢీ కొట్టింది. మరుక్షణం కొయ్య బొమ్మ కిర్రుమంటూ కదిలి దఢీమంటూ కింద పడిపోయింది. దాని చేతిలో వున్న త్రిశూలం ఎగిరి అంత దూరాన పడింది.

"ఆహా, మనం మహా ఘనకార్యం చేశాం. కాని, యీ రాక్షసి బొమ్మ కుప్ప కూలుతూ చేసిన ధ్వని పూజారికీ, వాడి అనుచరులకూ వినబడే వుంటుంది," అన్నాడు శిఖిముఖి.

"అందుకు సందేహం లేదు. నన్నడిగితే ఆ దుర్మార్గులు మనం యీ బొమ్మను సమీపిస్తూండటం ఏ రాళ్ళ చాటు నుంచో ముందే చూసి వుంటారంటాను. దాని చేతి లోని త్రిశూలం మన గుండెల్లో ఎప్పుడు





గుచ్చుకుంటుందా అని వాళ్ళు ఉవ్విళ్లూరి వుంటారు కూడా. కాని వాళ్ళ ఎత్తుపార లేదు," అన్నాడు విక్రమకేసరి.

"నిజమే. యిప్పుడు నాకో అనుమానం కలుగుతున్నది. మనం అమాయకంగా ఆ దుష్టులు పెట్టిన బోనులోకి నడవటం లేదు కదా! ఇంతకు ముందు మనం పల్లె వాసుల్ని గూడేనికి తిరిగి పొమ్మని చెప్ప టంలో పెద్ద పొరపాటు చేశాం. అంత పెద్ద శత్రుమూకను మన యిద్దరం ఎదిరించి ఎలా నిలవగలం? వాళ్ళు యీ దాపుల నున్న ఏ కొండ గుహలోనో వుంటారు. సందేహం లేదు," అన్నాడు శిఖిముఖి.

వాళ్ళిద్దరూ యిలా మాట్లాడుతున్నంతలో కొండ గుహల కేసి పోయిన ఎర్రగండు మొరుగుతూ వాళ్ళ దగ్గరకు పరిగెత్తు కొచ్చింది. కుక్కను చూస్తూనే శిఖిముఖికి పూజారి ముఠా ఆ దాపులనే ఎక్కడో దాగి వున్నారన్న అనుమానం కలిగింది. బహుశా వాళ్ళు తమ మీదికి దాడి రాబోతున్నారేమో!

శిఖిముఖి, ఎర్రగండు తల నిమురుతూ, "కేసరీ! మనం యిలా నిలబడి ముందుకు పోవటం ప్రమాదం. పూజారి అనుచరులు ఒక్క బాణం దెబ్బతో మనిద్దర్నీ హత మార్చగలరు. రాళ్ళ చాటుగా పాకుతూ ముందుకు పోదాం. ఎర్రగండు మనకు దారి చూపగలదు," అన్నాడు.

ఎర్రగండు పశికట్టి ముందుకు పోవటానికి మారుగా, వెనక కాళ్ళ మీద లేచి నిలబడి పెద్దగా మొరగసాగింది. దాని ప్రవర్తన బాగా తెలిసిన శిఖిముఖి రాళ్ళ చాటున పాకుతూ పోతున్నవాడల్లా లేచి నిలబడ్డాడు. అతడి దృష్టి తమ కేసి పరిగెత్తు కొస్తున్న ఒక శబరుడి పైన బడింది. అతడు విల్లం బులు ధరించి వున్నాడు. దూరాన్నుంచి పరిగెత్తు కొస్తున్న వాడిలా కనబడ్డాడు.

శబరుడు తనను సమీపించగానే శిఖి ముఖి, "అలా పరిగెత్తు కొస్తున్నావేం?





ఏం జరిగింది? నువ్వే గూడెం వాడివి?" అని ప్రశ్నించాడు.

శబరుడు రొప్పుతూ, "మాది తిమ్మ గూడెం. మా గూడెంలో వున్న ధాన్యమంతా ఎక్కడి నుంచో వచ్చిన సవరజాతి ముఠా వాళ్ళు దోచుకుంటున్నారు. సాయం కోసం మీ పల్లెకు వస్తున్నాను. పల్లె పెద్ద శివాలుడి కొడుకు శిఖిముఖివి కాదా నువ్వు? నీ కుక్కను చూసి, యీ ప్రాంతాల మీ వాళ్ళుంటారని, కుక్క వెనగ్గా పరిగెత్తు కుంటూ వచ్చాను," అన్నాడు.

శబరుడు దోపిడిదొంగలని చెప్పే సవర జాతి వాళ్ళు శిథిలాలయ పూజారి అను



చరులై వుంటారని శిఖిముఖీ, విక్రమకేసరీ కూడా భావించారు. శిఖిముఖి కొండ పాదంలో వున్న తిమ్మగూడెం దిక్కు కేసి చూస్తూ, ఆ గూడెంవాణ్ణి, "ఆ ధాన్యం దోపిడిగాళ్ళ వెంట అంత పొడుగ్గా శవా కారంలో వున్న వాడెవడైనా వున్నాడా?" అని అడిగాడు.

"అలాంటి వాడెవడూ లేడు. సవరల నాయకుడి పేరు గండుపోతు. ఇంత మీసాలూవాడూ-అడివి దున్నలా వున్నాడు," అని చెప్పాడు తిమ్మగూడెం వాడు.

"సరే, నువు మా పల్లెకు పోయి సంగతి చెప్పి మనుషుల్ని సహాయం తీసుకురా. మేం యిద్దరం ముందుగా మీ గూడేనికి పోయి ఆ గండుపోతు దోచుకున్న ధాన్యంతో పారిపోకుండా చూస్తాం. మీ గూడేనికి దారి నే నెరుగుదును," అన్నాడు శిఖిముఖి.

తిమ్మగూడెం వాడు, కుంభారమిట్ట పల్లె కేసి పరిగెత్తాడు. శిఖిముఖీ, విక్రమకేసరీ కొండదారుల వెంట తిమ్మగూడెం కేసి బయలుదేరారు. పావు గంట తరవాత వాళ్ళు ఆ గూడేన్ని చేరేసరికి, గూడానికి ఓ పక్కగా వున్న చెట్ల కింద చాలామంది శబరులు మందగా నిలబడి వున్నారు. వాళ్ళను అదిలిస్తూ పదీ పన్నెండుమంది





సవరజాతి వాళ్ళు కాపలా కాస్తున్నారు. ఆ కాపలా వాళ్ళను చూస్తూనే, శిఖిముఖీ, విక్రమకేసరీ ఆ దొంగలు శిథిలాలయ పూజారి అనుచరులని గ్రహించారు.

శిఖిముఖికి ఆ క్షణంలో ఓ ఉపాయం తోచి, ఆ కాపలా వాళ్ళను సమీపించి, "మీ యజమాని ఆ శిథిలాలయ పూజారి ఎక్కడున్నాడు? చాలా అవసరం అయిన పనుంది," అన్నాడు.

ఆ ప్రశ్నకు కాపలా వాళ్ళల్లో ఒకడు పొట్ట రెండు చేతులతో పట్టుకుని పెద్దగా నవ్వి, "పూజారి దొరను చూసేంత ఘనుడివా నువ్వు, శబరకుంకా! ఆ దొర కావాలనుకుంటే ప్రత్యక్షమవుతాడు, వద్దనుకుంటే మాయమై పోతాడు," అన్నాడు.

ఇంతలో కాపలావాళ్ళల్లో మరొకడు ఎర్ర గండు కేసీ, శిఖిముఖి కేసీ గుచ్చిగుచ్చి చూసి, "అరే! వీడు రాత్రి మనం పెట్టిన మాటు నుంచి తప్పించుకు పోయిన శబర పిశాచంగాడు. మన వాళ్ళ నిద్దర్ని గాయపరిచాడు. ఆ కుక్కను పట్టుకో బోయి మనలో నలుగురం కాట్లు తిన్నాం. ఆ పక్కన వున్న వాడి మొఖం ఎక్కడో చూసినట్టుందే!" అంటూ యీటె ఎత్తి శిఖిముఖీ వాళ్ళను సమీపించబోయాడు.

శిఖిముఖీ, విక్రమకేసరీ వాడి మీదికి యీటెలు గురిచేశారు: "మీ కాపలా వాళ్ళతో మాకు విరోధం లేదు. మీది మీదికి వచ్చారో మీకు చావు తప్పదు. యీలోపల మీరు మందవేసి కాపలా కాసే శబరులంతా పారిపోతారు. ఆ సంగతి తెలిసిందంటే పూజారి మిమ్మల్ని నిలువునా భస్మం చేసేస్తాడు," అన్నాడు శిఖిముఖి.

శిఖిముఖి యిలా అనేసరికి, అతడి మీదికి రాబోయిన సవరుడు ఈటె దించి, తిరిగి తన అనుచరుల దగ్గిరకు పోయి, "మనకు కుల పెద్ద గండుపోతు చెప్పిన పని వుండనే వున్నది. ఈ కుర్ర వెధవల్తో ఏం పని,"



అని చెప్పి, శిఖిముఖి కేసి తిరిగి, "పూజారి దొర ఎక్కడున్నాడో మాకు తెలీదు. ఆ దొరకు కుడిభుజంలాంటి సవరగండు పోతు గ్రామంలో ధాన్యం మూటలు కట్టిస్తున్నాడు. చావ దలుచుకుంటే అక్కడికి పోయి పూజారి దొర సంగతి అతణ్ణడగండి," అన్నాడు.

శిఖిముఖి, విక్రమకేసరీ అక్కణ్ణించి కదిలి గ్రామంలోకి కొంతదూరం నడిచి, యిప్పుడేం చేయటమా అని ఆలోచించారు. కనీసం ఓ అరగంట కాలంలో తమ పల్లె నుంచి సహాయం తప్పక వస్తుందని వాళ్ళకు నమ్మకం కలిగింది.



"ఆ గండుపోతుతో మాటలు పెంచి, వాడు ధాన్యం ఎత్తుకు పారిపోకుండా కొంత సేపు ఆపగలిగామంటే, మా అయ్యతో వచ్చే మన పల్లెవాళ్ళు, యీ సవర బందిపోట్లందరినీ పట్టేస్తారు. ఆ తరవాత ఒంటరిగాడై పోయిన పూజారిగాణ్ణి దొరక పుచ్చుకోవటం ఏ మంత కష్ట కార్యం కాదు. ఏ మంటావ్, కేసరీ?" అని ప్రశ్నించాడు శిఖిముఖి.

"భలే, ఆలోచన! ఊఁ పద," అన్నాడు విక్రమకేసరి. ఆ ఇద్దరూ గ్రామం మధ్యకు వెళ్ళేసరికి, అక్కడ ఒక పెద్ద పాతర నుంచి ధాన్యం బయటికి తీసి, కొందరు సవరలు మూటలు కడుతూండటం వాళ్ళ కంట బడింది. పాతరకు ఒక పక్కగా ఒక అజానుబాహుడు, కోరమీసాలు సవిరించుకుంటూ నిలబడి వున్నాడు.

శిఖిముఖి అతణ్ణి చూస్తూనే ఆగి పెద్ద గొంతుతో, "గండుపోతూ! నువు చేస్తున్నది అన్యాయ కార్యం. గ్రామవాసులంతా కలిసి దాచుకున్న ధాన్యాన్ని బలం వున్నది గదా అని దోచుకు పోవటం ధర్మం అనిపించుకోదు," అన్నాడు.

ఆ మాటలు వింటూనే గండుపోతు చర్రున వెనుదిగిరి, శిఖిముఖి కేసి అశ్చ



ర్యంగా చూసి, "ఎవడ్రా నువ్వు! శబర శివాలుడి కొడుకువా? నీ గురించి చాలా విన్నాను, ఒకసారి చూశాను కూడా. సవర కుల పెద్ద గండుపోతుకు న్యాయం, ధర్మం బోధ చేయటానికి వచ్చావా? అదేదో చెప్పటం కూడా నీకు చేత కాలేదు!" అంటూ పక్కన వున్న తన భృత్యుల కేసి తిరిగి, "అలా చూస్తారేం? వాణ్ణీ, వాడి మిత్రుణ్ణీ చెట్టుకు పెడరెక్కలు విరిచి కట్టండి," అన్నాడు.

గండుపోతు యిలా అనగానే, అతడి అనుచరులు నలుగురు ముందుకు వచ్చి, శిఖిముఖీ, విక్రమకేసరులను పట్టుకునేం దుకు, వాళ్ళ కేసి నడిచారు. కాని, శిఖి ముఖి తన మిత్రుణ్ణి హెచ్చరించి ఒక్కొక్క అడుగే వెనక్కు వేయసాగాడు. అతడి ఉద్దేశం; తమను పట్టుకో వస్తున్న వాళ్లను, ఆ ప్రదేశం నుంచి కొంత దూరంగా తీసుకు పోయి హతమార్చాలని. అలా కాకపోతే, గండుపోతు వెంట వున్న తతిమ్మా శత్రు వులు తమను చుట్టుముట్టి పట్టుకోగలరు.

శిఖిముఖి వెనకడుగు వేయటం చూసి, గండుపోతు హేళనగా నవ్వుతూ, "శబర పెద్ద శివాలుడి కొడుకు యింత పిరికి పంద అనుకోలేదు!" అన్నాడు.

ఆ మాట వింటూనే శిఖిముఖి ముందుకు రెండడుగులు వేసి, "గండుపోతూ! వయ సులో, ఎత్తులో, బలంలో కూడా నా కన్న రెండింతలున్నావు. నన్ను పట్టుకునేందుకు నీ భృత్యుల్ని పంపటం ఎందుకు? నువే, ఆ పని చేయకూడదా?" అన్నాడు.

గండుపోతు కళ్ళు నిప్పులు చెరిగినై. అతడు ఒకసారి హుంకరించి, ఎడం చేత్తో మీసం మెలివేస్తూ, యీటె పైకెత్తి, "నీవు చావుకోరి యిక్కడి కొచ్చినట్టుంది. ఇదిగో వస్తున్నాను, కాచుకో!" అంటూ, ఈటెను శిఖిముఖి గుండెల కేసి గురిచేసి, ఝుళిపించి ముందుకు దూకాడు. —(ఇంకా వుంది)





# మాయరోగం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ పట్టుదల వజ్రదత్తుడి పట్టుదలను కూడా మించి ఉన్నదే. అయితే అతనిలాగా నువు సిద్ధించిన ఆశయాన్ని కూడా చెయ్యి జారి పోనీకు. శ్రమతెలియకుండా ఉండగలందులకు నీకు వజ్రదత్తుడి కథ చెబుతాను విను," అంటూ ఇలా చెప్పసాగాడు.

పూర్వం మగధను ఏలిన దేవదత్తుడికి వజ్రదత్తు డనే కొడుకు ఉండేవాడు. చిన్నతనం నుంచీ అతనికి వైద్యశాస్త్రంలో చాలా ఆసక్తి ఉంటూ వచ్చింది. బాల్యంలోనే అతను వైద్యగ్రంథాలన్నీ చదివాడు. తరవాత సమస్త మూలికల ఉపయోగాలూ తెలుసుకున్నాడు. కొంత కాలం అటవికు

## బేతాళ కథలు



తెలుసుకోగలడు. అందుచేత తాను చూసిన కన్యలలో అతనికి ఏవేవో లోపాలు కనిపించాయి.

ఆ కాలంలో విదర్భదేశంలో విక్రమసేన మహారాజుకు తేజోవతి అనే అపురూప సుందరి అయిన కుమార్తె ఉండేది. ఆమె తల్లిదండ్రులు కూడా తమ కుమార్తెకు అన్ని విధాలా తగిన భర్త ఎక్కడ దొరుకుతాడా అని తెగ వెతుకుతున్నారు. వాళ్లు వజ్రదత్తుడి ఉదవందాలను గురించి విని ఉన్నారు. కాని తమ కుమార్తెను మగధకు తీసుకుపోయి వజ్రదత్తుడికి చూపటం తమ పరువుకు లోపమని వారికి అనిపించింది. అయితే, వజ్రదత్తుడు తేజోవతిని ప్రత్యక్షంగా చూసిన పక్షంలో అతను తప్పక ఆమెను వరించి, పెళ్ళాడతాడన్న నమ్మకం వారి కున్నది.

ఈ స్థితిలో తేజోవతీ, ఆమె తల్లిదండ్రులూ కలిసి, వజ్రదత్తుణ్ణి విదర్భకు రప్పించటానికొక ఎత్తు ఆలోచించారు. తేజోవతికి హఠాత్తుగా మాట పడిపోయిందన్న వార్త దేశమంతటా గుప్పుమన్నది. తన కుమార్తెకు తిరిగి మాట తెప్పించిన వైద్యుడికి వైద్యుడి ఎత్తు బంగారం ఇస్తానని విక్రమసేనుడు ప్రకటన చేశాడు. ఎందరో వైద్యులు వచ్చి

లతో తిరిగి అనేక రహస్య చికిత్సలు నేర్చుకుని, యౌవనం సంప్రాప్తించే నాటికి అపర ధన్వంతరి అనే కీర్తి తెచ్చుకున్నాడు.

యుక్తవయస్సు రాగానే అతని తల్లిదండ్రులు అతనికి వివాహం చేయ సంకల్పించారు. వజ్రదత్తుడు నవమన్మథాకారుడు. అందుచేత అతని కోసం అతిలోక సౌందర్యం గల కన్యలు ఎక్కడైనా దొరుకుతారా అని తెగ వెతికారు. వారికి నచ్చిన కొద్దిమంది కన్యలు వజ్రదత్తుడికి నచ్చలేదు. అతను ఏ మనిషిని చూసినా వెంటనే ఆ మనిషిలో ఉండే శరీర సంబంధమైన లోపాలూ, మానసిక సంబంధమైన లోపాలూ

తేజోవతిని చూశారు. కాని ఏమీ ప్రయోజనం లేకపోయింది. ఏ వైద్యుడైనా నిజంగా మాటపడిపోయిన మనిషికి చికిత్స చెయ్యగలడు గాని, మాటపడిపోయినట్టు నటించే మనిషికి చికిత్స చెయ్యటం ఎవరివల్ల సాధ్యమవుతుంది?

కొంత కాలం గడవనిచ్చి విక్రమసేనుడు మగధకు మనిషిని పంపుతూ, తన కుమార్తెకు చికిత్సచేసి పోవలసిందని వజ్రదత్తుణ్ణి అర్థించాడు. వజ్రదత్తుడు తన తండ్రి అనుమతి పొంది, ఆ మనిషి వెంట విదర్భకు ప్రయాణమై వచ్చాడు. వజ్రదత్తుడికి విక్రమసేనుడు సకల మర్యాదలూ, అల్లుడి కన్న ఎక్కువగా జరిపి, తన కుమార్తెను చూపించాడు. తేజోవతిని చూస్తూనే వజ్రదత్తుడు అటువంటి కన్య ప్రపంచంలో మరొకతె ఉండదనీ, ఆమెకు చికిత్స చేసిన అనంతరం, ఆమెను తన కిచ్చి వివాహం చేయమని విదర్భరాజు నడుగుదామనీ అనుకున్నాడు.

అయితే తేజోవతికి నిజంగా మాట పడిపోలేదనీ, ఆమె ఏ కారణం చేతనో అలా నటిస్తున్నదనీ తెలుసుకోవటానికి వజ్రదత్తుడికి ఎన్నో క్షణాలు పట్టలేదు.

"నయం చెయ్యటానికి ఇదేమంత కష్టతరమైన వ్యాధి కాదు. మీ రాజ్యంలో





ఉండే ఘన వైద్యులు దీన్ని కుదర్చలేక పోయారంటే ఆశ్చర్యంగా ఉన్నది. ఒక్క మాత్రతో ఈమె రోగాన్ని నయం చేస్తాను," అని వజ్రదత్తుడు, తన మందుల సంచిలో నుంచి ఒక మాత్ర తీసి, తాను చూస్తూండ గానే తేజోవతి చేత మింగించాడు.

ఆ రాత్రే అతను విదర్భరాజు వద్ద సెలవు పుచ్చుకోకుండా, ఎవరికీ తెలియకుండా మగధకు ప్రయాణమై వెళ్లిపోయాడు.

మర్నాడు ఉదయానికి తేజోవతికి నిజం గానే మాటపడిపోయింది. విక్రమసేనుడు కంగారుపడి, వజ్రదత్తుడి బసకు మనిషిని పంపితే అతడు వెళ్లిపోయినట్టు తెలిసింది.

గత్యంతరం లేక విక్రమసేనుడు తన కుమార్తెను వెంటబెట్టుకుని మగధకు వెళ్ళాడు. వజ్రదత్తుడికి ఎన్నో క్షమాపణలు చెప్పుకున్నాడు. తన కుమార్తె మాటపడి పోయినట్టు నటించిన కారణం కూడా అతడికి చెప్పాడు.

వజ్రదత్తుడు తేజోవతికి మరొక మాత్ర ఇచ్చాడు. ఒక్క గడియ కాలంలో ఆమెకు మాట తిరిగి వచ్చింది. వజ్రదత్తుడి తల్లి దండ్రులు తేజోవతి పట్ల చాలా సానుభూతి చూపారు. తమ కొడుకును పెళ్ళాడే ఉద్దేశంతో ఆమె మాటపడిపోయినట్టు నటిం చటం ఏమంత గొప్ప నేరంగా వారికి తోచ లేదు. తేజోవతి తమ కోడలైతే ఎంతో బాగుంటుందని వారు చాలా ముచ్చట పడ్డారు కూడా.

"నేను వచ్చిన పని సగం పూర్తి అయింది, నా కుమార్తెను పెళ్ళాడి దాన్ని పూర్తిచెయ్యి," అని విక్రమసేనుడు వజ్ర దత్తుడితో అన్నాడు.

"మీరు మీ అమ్మాయి చికిత్స కోసం ఎన్నో శ్రమల కోర్చి మా రాజ్యానికి వచ్చారు. ఆ పని పూర్తి చేశాను. ఇంక నన్నేమీ అడగకండి ప్రయోజనం వుండదు," అన్నాడు, వజ్రదత్తుడు.

విక్రమసేనుడు దేవదత్తుడితోనూ, ఆయన భార్యతోనూ చెప్పుకుని, "మీ కుమారుడి మనసు మార్చటానికి యత్నించండి. నా కుమార్తె అతని పైనే ఆశలన్నీ పెట్టుకున్నది," అన్నాడు.

తల్లిదండ్రులు ఎంతగా చెప్పినా వజ్రదత్తుడు తేజోవతిని పెళ్ళాడటానికి ఒప్పుకో లేదు. చివరకు విక్రమసేనుడు హతాశుడై, తన కుమార్తెను వెంటబెట్టుకుని విదర్భకు తిరిగి వెళ్ళిపోయాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, వజ్రదత్తుడు మొట్టమొదట తేజోవతిని చూడగానే ఆమెను పెళ్ళాడా లనుకున్నాడు గదా, చివరకు ఆమెను నిరాకరించటానికి కారణ మేమిటి? ఆమె లేని మూగతనం నటించి తనను మోసగించిందని ఆగ్రహించాడా? ఆమె అలా చేసినది అతని కోసమే గద! ఆ సంగతి తెలిసి కూడా అతని మనసు ఎందుకు మారలేదు? పోనీ, తనను మోసగించిందని ఆగ్రహించినవాడైతే తిరిగి ఆమెకు మాట ఎందుకు తెప్పించాడు? ఈ ప్రశ్నలకు సమాధానం తెలిసి చెప్పకపోతే నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "వజ్రదత్తుడు అన్ని వ్యాధులనూ నిదానం చెయ్యగల అపర ధన్వంతరి. కాని తేజోవతికి అతని



శక్తులలో నమ్మకం లేక, అతని ఎదట మాటపడిపోయినట్టు నటించి, అతని శక్తికి తీరని అవమానం చేసింది. తన శక్తిని ప్రదర్శించటానికే అతను ఆమెకు నిజంగా మాట పోగొట్టాడు. వ్యాధిగ్రస్తులు కోరినప్పుడు చికిత్స చెయ్యటం వైద్యుడి విధి కనక, తాను పోగొట్టిన మాటను తానే తిరిగి తెప్పించి, తన ధర్మాన్ని నిర్వర్తించుకోవటంతో బాటు తన శక్తిని మరొకసారి రుజువు చేసుకున్నాడు. ఇక, అతను తేజోవతిని పెళ్ళాడటం మాటకు వస్తే, తేజోవతి ఆశయం అతని కళ్ళ పడటమే అయిన పక్షంలో, అతను తన వద్దకు వచ్చిన క్షణంలోనే ఆమె అతనితో తనకు నిజంగా మాటపడిపోలేదనీ, అతనిని రప్పించటానికే తా నీ యెత్తు వేశాననీ చెప్పి ఉంటే అతను క్షమించి ఉండేవాడేమో. తనను పెళ్ళాడగోరిన తేజోవతి తానే, ఈ నాటకమంతా లేకుండా, మగధకు వచ్చి ఉంటే అతను తప్పక పెళ్ళాడేవాడు. అలా చెయ్యక తనను మగధ నుంచి రప్పించి, తాను వచ్చినాక కూడా తన శక్తిలో అవిశ్వాసం ప్రదర్శించటం అతను సహించలేక పోయాడు. తాను వలచిన వాడుగా అతన్ని చూడటానికి తేజోవతి మగధకు రాలేకపోయింది గనక, వైద్యుడుగా తనను చూడవచ్చేటట్టు చేశాడు వజ్రదత్తుడు. ఆమెకు మాట తెప్పించగానే వారు వచ్చిన పని ముగిసిందని అతను విక్రమసేనుడితో అన్నది కూడా అందుకే. మగధకు రావటంలో వారి ఉద్దేశం వజ్రదత్తుడికీ, తేజోవతికీ వివాహం చెయ్యటమే అయిన పక్షంలో విక్రమసేను డా ప్రయాణాన్ని ఏ నాడో చేసి ఉండవలిసింది. అందుచేత వజ్రదత్తుడు తేజోవతిని వివాహమాడ నిరాకరించటానికి బోలెడంత కారణం ఉన్నది," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# సుల్తాను తీర్పు

అరేబియాలో ఒక నగరాన్ని ఒక సుల్తాను పాలించేవాడు. ఆ నగరంలో హసన్ అనే ఒక పేద యువకు డుండేవాడు. అతను చాలా అందగాడూ, గొప్పగాయకుడూ కూడానూ. అతను జమీలా అనే ఒక పేద పిల్లను ప్రేమించాడు. ఆమె కూడా చాలా గొప్ప సౌందర్యవతి.

జమీలా సౌందర్యం చూసి ముగ్ధుడై ఒక అమీరు ఆమెను పెళ్ళాడగోరి మధ్యవర్తులను పంపాడు. కాని జమీలా తాను హసన్ను తప్ప మరెవరినీ పెళ్ళాడనని అమీరుకు కబురు చేసింది. అమీరు జమీలాను తన ధనంతో వశపరుచుకోలేక, ఒకనాటి రాత్రి తన జవాన్లను పంపి, ఆమెను ఆమె ఇంటి నుంచి బలాత్కారంగా తన ఇంటికి తెప్పించుకున్నాడు.

ఈ వార్త తెలుస్తూనే హసన్ సుల్తాను గారి భవనానికి వెళ్ళి, తక్షణమే సుల్తాను గారి దర్శనం కావాలని ద్వారరక్షకులతో చెప్పాడు. సుల్తానుగారు పడుకుని నిద్ర పోయే సమయమనీ, మర్నాడు ఉదయం రమ్మనీ ద్వారరక్షకులు హసన్‌తో అన్నారు.

"తెల్లవారేలోపల నాకు తీరని అన్యాయం జరిగిపోతుంది," అన్నాడు హసన్ ఆందోళన కనబరుస్తూ.

"దానికి మేమేమి చెయ్యగలం? ఇప్పుడు సుల్తానుగారిని పలకరిస్తే మా పీకలు తెగిపోతాయి," అన్నారు ద్వారరక్షకులు.

ఏమి చెయ్యటానికీ హసన్‌కు పాలుపోలేదు. అతను తన శ్రావ్యమైన కంఠం ఎత్తి దీనంగా పాడసాగాడు.

నిద్రపట్టక ఈ కోటా ఆ కోటా పడుతున్న సుల్తానుకు హసన్ సంగీతం అమృతవర్షం లాగా చెవులపడింది. ఆయన తన నౌకర్లను పిలిచి, "ఆ పాడే మనిషిని తీసుకురండి," అని ఆజ్ఞాపించాడు.

వర్వేపల్లి సుబ్బారావు

నౌకర్లు హసన్‌ను లోపలికి పిల్చుకుపోయి సుల్తాను ఎదట హాజరుపెట్టారు.

హసన్‌తో సుల్తాను, "నీ గాత్రం చాలా బాగుంది. తెల్లవార్లూ నాకు పాటపాడి విని పించు, నీ కోరిక తీర్చుతాను," అన్నాడు.

"నేను పాట పాడటానికి రాలేదు, హుజూర్. న్యాయం కోసం వచ్చాను. నన్ను ప్రేమించే పిల్లను ఒక అమీరు బలాత్కారంగా తీసుకుపోయాడు. తమరు అడ్డపడక పోతే, ఆయన ఆమెను పెళ్ళాడేస్తాడు. ఆమె మరొకడి భార్య అయిపోతే నా జీవితం ఎడారి అయిపోతుంది. నేను వెర్రివాణ్ణి అయిపోతాను," అని హసన్ ఆక్రోశించాడు.

సుల్తాను కొంచెం ఆలోచించి, "నువు తెల్లవారిన దాకా నాకు పాట వినిపించు. రేపు నీకు పూర్తి న్యాయం చేకూర్చుతాను," అన్నాడు. హసన్ బరువెక్కిన గుండెతో కరుణరసం ఉట్టిపడేటట్టు తెల్లవార్లూ పాటలు పాడాడు.

తెల్లవారిపోయింది. సుల్తాను తన భటులను పిలిచి, "ఫలాని అమీరును వెంటనే పట్టుకురండి," అని పంపాడు.

అమీరు భటుల వెంట వచ్చి సుల్తానుకు సలాములు చేశాడు.

"నువు నిన్న రాత్రి జమీలా అనే పిల్లను బలాత్కారంగా నీ యింటికి చేర్పించావట



అది నిజమైతే నిన్ను తీవ్రంగా శిక్షించవలసి ఉంటుంది," అన్నాడు సుల్తాను.

"హుజూర్, ఇంతకుముందే కాజీ వచ్చి మా ఇద్దరికీ వివాహం జరిపించారు. వివాహానంతరం మేమంతా విందులో ఉండగా తమ భటులు వచ్చి నన్ను తీసుకువచ్చారు. పెళ్ళివిందు ఇంకా పూర్తి కాలేదు," అన్నాడు అమీరు.

సుల్తాను కళ్ళెర్ర చేసి, "నువు జమీలాను బలాత్కారంగా ఎత్తుకు పోవటమే గాక, ఆమె సమ్మతిలేకుండా పెళ్ళికూడా చేసుకున్నావా? నీకు మరణదండన విధిస్తున్నాను," అని తన భటులతో, "ఈ దుర్మార్గుడికి వెంటనే మరణశిక్ష ఇవ్వమని వలీతో చెప్పండి," అన్నాడు.

భటులు అమీరును పట్టుకుపోయారు.

ఇదంతా హసన్‌కు చాలా బాధ కలిగించింది. అతను సుల్తానుతో, "హుజూర్, తమరు అప్పుడే అడ్డపడి ఉంటే ఈ వివాహం తప్పేదిగద! తెల్లవారిన దాకా ఎందుకు తాత్సారం చేశారు?" అన్నాడు.

సుల్తాను నవ్వి, "హసన్, నువు సజ్జనుడివి. ఈ అమీరు చాలా పెద్ద దుర్మార్గుడు. ఇలాంటి పను లెన్నో చేసి, తన చేత అన్యాయం పొందిన వారి నోళ్ళు డబ్బుతో కట్టుతూ వచ్చాడు. తెల్లవారేలోపుగా వాడు నీ జమీలాను పెళ్ళాడతాడని నాకు తెలును. అందువల్ల నీకు వచ్చిన నష్టమేమీ లేదు. అమీరు చచ్చిపోయాక జమీలా వాడి ఆస్తికి అధికారిణి అవుతుంది. మీ రిద్దరూ పెళ్ళాడటానికి నేను అనుమతి ఇస్తాను. ఆ తరవాత నువు నా ఆస్థాన గాయకుడివిగా ఉండి, ప్రేమగీతాలు పాడుదువుగాని," అన్నాడు.

తాను కోరిన దానికన్న సుల్తాను హెచ్చు న్యాయమే చేశాడని హసన్ అర్థం చేసుకున్నాడు. అమీరు పొందే మరణ శిక్షకు అచ్చగా తన ఫిర్యాదే కారణంకాదని తెలిసి అతను కొంత ఊరటకూడా చెందాడు.





# పిశాచాల వంటవాడు

ఒక గ్రామంలో ఒక విధవరాలికి ఒక కొడుకుండేవాడు. వాడి పేరు రాముడు. వాడు తెలివిగల వాడే గాని, అస్తమానమూ తిరుగుతూండేవాడు. వాడికి ఏ పనీ రాదు. కొంతకాలానికి తల్లి చనిపోగా, రాముణ్ణి మేనమామ తమ ఊరికి తీసుకుపోయి, అక్కడ నాలుగైదుమంది భూస్వాముల వద్ద వాణ్ణి పనికి పెట్టాడు. కాని వాడు ఏ ఒక చోటా కుదురుగా ఉండలేదు. మేనమామకు ప్రాణం విసిగిపోయి, రాముణ్ణి ఇంటి నుంచి సాగనంపాడు.

రాముడు మేనమామ ఇంటి నుంచి బయలుదేరి, నాలుగు రోజులు ప్రయాణం చేసి ఒక కీకారణ్యం చేరుకున్నాడు. అరణ్యం మధ్య వాడి కొక కోట కనిపించింది. కోట ముందు ఒక బావి ఉన్నది. ఒక ముసలిది ఆ బావిలో నుంచి కష్టపడి నీరు తోడి, కింద పారబోస్తున్నది.

ముసలిదాని ప్రవర్తన రాముడికి అర్థం కాలేదు. వా డామెను సమీపించి, "అవ్వా! ఇంత శ్రమపడి నీళ్ళుతోడేదానివి, ఆ నీళ్ళను ఎందుకు పారబోసేస్తున్నావు? నీకు ఆయాసంగా ఉన్నట్టున్నది, ఆ చేద ఇలాతే, నేను తోడుతాను," అన్నాడు.

"ఇంకో యాభై చేదలు తోడి పారబోస్తే గాని పిశాచాలు రావు, నాయనా!" అంటూ ముసలిది చేదను రాముడి కిచ్చి, తన గుడిసెలోకి పోయింది.

రాముడికి అంతా అయోమయంగా ఉన్నది. అయినా వాడు బావిలో నుంచి నీళ్ళు చేది పారపొయ్యసాగాడు. అలా వాడు యాభై చేదలు తోడి పోసేసరికి, రెండు జల పిశాచాలు బావిలో నుంచి పైకి వచ్చి, తిన్నగా కోటలోకి పోయాయి. మరి కొంత సేపటికి అవి కోట నుంచి తిరిగి వచ్చి, తిరిగి బావిలోకి వెళ్ళాయి.

ఎస్. నిర్మల



రాముడు గుడిసెలో విశ్రాంతి తీసుకుంటున్న అవ్వ వద్దకు వెళ్ళి, "అవ్వా, నువ్వు నీళ్ళు తోడి పారబొయ్యటమేమిటి? ఈ పిశాచాలు కోటలోకి వెళ్ళి ఏం చేస్తాయి? ఈ కోటలో ఎవరున్నారు?" అని అడిగాడు.

అవ్వ నిట్టూర్చి, "నాయనా, ఒకప్పుడు ఆ కోట నాదే. నేను మంత్రగత్తెను. ఎక్కడి నుంచో ఒక ఒంటి కొమ్ము రాక్షసుడు వచ్చి, నా కోటను కాజేశాడు. నా మంత్రదండాన్ని కాజేసి, తన చెవిలో దాచుకున్నాడు. ఆ దండంతో బాటే నా శక్తులన్నీ పోయాయి. ఆ దండాన్ని తిరిగి సంపాదించేటందుకు ప్రయత్నించిన నా కొడుకు లిద్దర్నీ ఆ రాక్షసుడు విరుచుకు తినేశాడు. ఈ బావిలో రెండు పిశాచాలున్నాయి. ఎవరైనా బావిలో నుంచి నూరు చేదలు నీరు తోడేస్తే అవి బయటికి వస్తాయి. అవి రాక్షసుడికి వంట చేసిపెడతాయి," అన్నది.

"అవ్వా, నీ మంత్రదండాన్ని నేను తెచ్చి పెడతాను. నువ్వు నిశ్చింతగా ఉండు," అన్నాడు రాముడు.

వాడా రోజు అవ్వ గుడిసెలోనే ఉండి, అవ్వ పెట్టిన భోజనం తిన్నాడు. మర్నాడు బావిలో నుంచి నూరు చేదల నీళ్ళూ వాడే తోడి పారపోశాడు. పిశాచాలు బావిలో



నుంచి వచ్చి కోటలోకి పోయాయి. రాముడు కూడా వాటి వెనకటితే వెళ్ళాడు.

లోపల వంట ఇంట్లో రాక్షసుడు వేటాడి తెచ్చిన మృగాలు కుప్పపోసి ఉన్నాయి. పిశాచాలు గబగబా పొయి రాజేసి, మాంసం తరిగి వంట నారంభించాయి. రాముడు వెనకపాటుగా వెళ్ళి, రెండు పిశాచాలనూ జుట్టుపట్టి ఎత్తి, పొయి మీద మాంసం ఉడుకుతున్న గంగాళంలో వేసేశాడు.

రాముడు వంట పూర్తిచేసి, పర్వతంలా పడుకుని నిద్రపోతున్న రాక్షసుణ్ణి లేపి, వడ్డించాడు. పిశాచాలు చేరటంవల్ల కాబోలు రాక్షసుడికి భోజనం ఈరోజు మరీ బాగుంది.



"ఆహా, ఈరోజు వంట ఎంత బాగుంది! ఎవరు చేశారీ వంట?" అన్నాడు రాకసుడు.

రాముడు ధైర్యంచేసి రాకసుడి ఎదట పడి, "ఇవాళ పిశాచాలు రాలేదండీ. వంట నేనే చేశాను," అన్నాడు.

రాకసుడు మొదటిసారిగా రాముడి కేసి తలతిప్పి తేరిపారజూసి, "నువ్వెవరు?" అని అడిగాడు.

"నేను పిశాచాల వంటవాణ్ణి," అన్నాడు రాముడు.

"భేష్! నీ వంట బాగుందిరా, అబ్బీ! ఇక రోజూ నువే వచ్చి వంట చేస్తూండు, పిశాచాలను రావద్దను," అన్నాడు రాకసుడు.

రాకసుడు కడుపునిండా తిని, మళ్ళీ పడుకుని, కోట దద్దరిల్లేటట్టు గురకపెట్టి నిద్రపోసాగాడు. ఆ సమయం చూసి రాముడు రాకసుడి చెవిలో ఉన్న మంత్ర దండాన్ని సంగ్రహించి, తీసుకుపోయి గుడి సెలో ఉన్న అవ్వ కిచ్చాడు.

మంత్రదండం చేతికిరాగానే అవ్వకు వెయ్యి ఏనుగుల బలం వచ్చినట్టయింది. ఆమె గబగబా కోటకు వెళ్ళి, నిద్రపోతున్న రాకసుడి మీద మంత్రదండం తిప్పుతూ ఏదో మంత్రం చదివి, వాడి తలమీద దానితో మూడుసార్లు కొట్టింది. వెంటనే ఒంటికొమ్ము రాకసుడు భగ్గున మండి, బూడిద అయిపోయాడు.

తరవాత మంత్రగత్తె రాముడితో, "నాయనా, నా కొడుకులుపోతే పోయారు. నువ్వే నా మనవడివనుకుంటాను. ఈ కోటలో అంతులేని ధనం ఉన్నది. దాన్ని తీసుకుపోయి, సుఖంగా బతుకు," అన్నది.

మంత్రగత్తె చూపిన ధనమంతా మూట గట్టుకుని రాముడు మేనమామ ఇంటికి తిరిగి వచ్చాడు. తన మేనల్లుడు ప్రయోజకుడైనందుకు మేనమామ సంతోషించి, వాడికి తన కూతురునిచ్చి పెళ్ళిచేసి, తన వద్దే వుంచుకున్నాడు.





# చిలుక పలుకులు

ఒకానొక గ్రామంలో ముసలయ్య అనే రైతు ఉండేవాడు. అతనొక చిలుకను అతి ముద్దుగా పెంచుతున్నాడు.

ఒకనాటి సాయంకాలం ముసలయ్య పొలం నుండి వస్తున్నాడు. దారిలో అతనికొక మేకపోతు కనిపించింది. ఆ మేకపోతు, ముసలయ్య పొరుగున ఉండే కనకయ్యదే. అది రెండు మూడు రోజులుగా కనిపించక పోవటం చేత కనకయ్య దాని కోసం తెగ వెతుకుతున్నాడు.

ముసలయ్య దాన్ని రహస్యంగా తన ఇంటికి తీసుకొచ్చి చంపేశాడు. దాని మాంసం కొంత ఆ రాత్రి వండించి, మరి కొంత మర్నాటికి ఉంచాడు. మిగిలిన మాంసం, దగ్గిర గ్రామంలో ఉండే తన బంధువులకు పంపే ఉద్దేశంతో దాచి పెట్టాడు. మేకపోతు చర్మం చుట్ట చుట్టి చూరులో భద్రంగా దాచాడు.

ఇదంతా పంజరంలో ఉన్న పెంపుడు చిలుక చూస్తూనే ఉన్నది.

ఇది జరిగిన మర్నాడే కనకయ్య ముసలయ్య ఇంటికి వచ్చి, అదీ ఇదీ మాట్లాడుతూ, తన మేకపోతు ఇంకా దొరకనే లేదని అన్నాడు.

వెంటనే, ముసలయ్య పెంచుకుంటున్న చిలుక కనకయ్యతో ముసలయ్య కిందటి రాత్రి చేసిన దంతా పూసగుచ్చినట్టు చెప్పేసింది. కనకయ్య, ముసలయ్యతో ఏమీ అనక, పొయ్యేటప్పుడు ముసలయ్య ఇంటి చూరులో మేకచర్మం దోపి ఉండటం కళ్ళారా చూశాడు.

కనకయ్య తిన్నగా వెళ్ళి గ్రామాధికారి దగ్గిర ఫిర్యాదు చేస్తాడని ముసలయ్య ఊహించి, ఆ రాత్రి చిలుక మీద ఒక డబ్బా బోర్లించి, దాని మీద నీళ్ళు బొట్లు బొట్లుగా చాలా సేపు పోశాడు.

కాలిపు వీరభద్రుడు

ముసలయ్య ఊహించినట్టే మర్నాడు గ్రామాధికారి మంచి మనిషి వచ్చి, ముసలయ్యనూ, అతని చిలుకనూ రమ్మంటున్నారని చెప్పాడు. ముసలయ్య చిలుకతో సహా గ్రామాధికారి వద్దకు వెళ్ళాడు.

గ్రామాధికారి చిలుకను ప్రశ్నించి, ముసలయ్య మేకపోతును ఇంటికి తెచ్చి చంపటమూ, కొంత మాంసం వండించటమూ, కొంత దాచటమూ, మేకపోతు చర్మాన్ని చూరులో దోపటమూ మొదలైన వివరాలన్నీ, కనకయ్యకు చెప్పినట్టే, చెప్పించాడు.

ఈ విధంగా చిలుక చేత సాక్ష్యం పలికించి, న్యాయాధికారి ముసలయ్యతో, "ఇప్పుడైనా నువు కనకయ్య మేకపోతును కాజేసినట్టు ఒప్పుకుంటావా?" అన్నాడు.

ముసలయ్య గ్రామాధికారితో, "దాని మాటలు నమ్మకండి, బాబూ. అది నోటికి వచ్చిన అబద్ధాలన్నీ చెబుతుంది," అని చిలుకను, "నిన్న రాత్రి ఏం జరిగిందే?" అని అడిగాడు.

"నిన్న రాత్రి కటిక చీకటి. చాలాసేపు వాన కూడా పడింది," అన్నది చిలుక.

"చూశారా, బాబూ. నిన్న రాత్రి పండు వెన్నెల కాస్తే చీకటిగా ఉందట. చాలాసేపు వాన కూడా కురిసిందిట. ఒక్క చిన్న మబ్బుతుంపన్నా ఆకాశాన లేదు," అన్నాడు ముసలయ్య న్యాయాధికారితో.

చిలుక అబద్ధాలాడుతుందని నమ్మకం కుదిరి, న్యాయాధికారి ముసలయ్యని నిర్దోషిగా ఎంచి, పంపేశాడు.

ఇంటికి వస్తూనే, ముసలయ్య తన చిలుకను వెళ్ళగొట్టేశాడు. అది అడవిలో ఉండే ఇతర చిలుకలను చేరుకుని, "ఛీ, ఛీ! మనుషులు చాలా పాపిష్ఠివాళ్ళు. వాళ్ళు అనమన్న మాటలే మనం అనాలిగాని, సొంతాన మన మేమీ మాట్లాడరాదు," అని వాటితో చెప్పింది.





# నాభాగుడు

మనువు కొడుకు నభగుడు. నభగుడికి చాలామంది కొడుకులుండేవారు. వాళ్ళు ఒక్కొక్కరే వైదికకర్మలు నేర్చుకుని, యజ్ఞ కర్మలు చేసి, క్రతువులలో సహాయపడి గోధనం నంపాదించుకున్నారు, పెళ్లిళ్ళు చేసుకుని గృహస్థులయ్యారు.

నభగుడి కొడుకులందరిలోకీ చిన్నవాడైన నాభాగుడు బ్రహ్మచారిగా ఉండగానే అన్న దమ్ములందరూ గోధనాన్ని పంచుకున్నారు. అప్పుడు నాభాగుడు తన వంతు కూడా తన కివ్వమని అన్నలను అడిగాడు.

"నువ్వు వెళ్ళి, నాన్నను భాగం అడుగు. ఆయన ఏంచెయ్యమంటే అదే చేస్తాం," అన్నారు నాభాగుడి అన్నలు.

నాభాగుడు తండ్రి వద్దకు వెళ్లి, "అన్నలు గోధన మంతా పంచుకుంటున్నారు. నాకు కూడా వంతు ఇవ్వమంటే, నిన్ను అడగ మన్నారు," అన్నాడు.

నభగుడు తన కొడుకుతో, "వాళ్ళం దరూ యజ్ఞకర్మలు చేసీ, చేయించీ గోధనం నంపాదించుకున్నారు. గృహస్థులయూరు కనక గోధనాన్ని పంచుకున్నారు. నువ్వింకా యజ్ఞకర్మలు చేయించలేదు. గోధనం నంపా దించలేదు. బ్రహ్మచారివి. వాళ్ళతోపాటు సమంగా నీ కెలా భాగం వస్తుంది?" అని ప్రశ్నించాడు.

"అయితే మరి నాగతేమిటి?" అని నాభాగుడు తండ్రి నడిగాడు.

"అంగీరసులు సత్రయాగం చెయ్య బోతున్నారు. వాళ్ళు అంతా తెలిసినవాళ్ళే గాని, ఆరవరోజు జరగవలిసిన కర్మకు సంబంధించిన వైశ్వదేవసూక్తాలు వారికి తెలియవు. నువ్వా సత్రయాగానికి వెళ్ళి, ఆ వైశ్వదేవసూక్తాలు రెండు చదివి, ఆనాటి కర్మకాండ వారికి తెలియజెయ్యి. తరవాత నిన్ను కవిగా అందరూ గుర్తిస్తారు. సత్ర

యాగం పూర్తి అయాక యజ్ఞశేషాన్ని దానంగా పుచ్చుకుని వచ్చెయ్యి. ఆ విధంగా నీకు కూడా గోధనం ఏర్పడుతుంది," అని హితబోధ చేశాడు తండ్రి.

నాభాగుడు తండ్రి చెప్పిన ప్రకారమే అంగీరసులు చేసే సత్రయాగానికి వెళ్ళాడు. ఆరవరోజు కర్మకాండ తెలియక వారు మూఢులై ఉండగా, వారికి సాయపడి, యజ్ఞశేషం తన కిచ్చేటట్టు వారిచేత ఒప్పందం చేయించుకున్నాడు.

యాగం పూర్తి అయింది. అంగీరసులు యాగశేషాన్ని నాభాగుడికి ఇచ్చేశారు. కాని ఒక నల్లని ఆకారం గలవాడు వచ్చి, యాగశేషాన్ని తానే తీసుకో నారంభించాడు.

"దీన్ని అంగీరసులు నా కిచ్చేశారు. నువ్వెందుకు తీసుకుంటున్నావు?" అని నాభాగుడు ఆ నల్లని వ్యక్తిని అడిగాడు.

"యాగశేషం రుద్రుడికే చెందుతుంది. నేను రుద్రుడి పక్షాన ఈ గోధనాన్ని తీసుకుపో వచ్చాను. నా మాటలో నమ్మకం లేకపోతే నీ తండ్రినే అడుగు," అన్నాడు నల్లనివాడు.

నాభాగుడు తన తండ్రి దగ్గిరికి వచ్చి జరిగినదంతా చెప్పి, "యాగశేషం రుద్రుడికే చెందుతుందని రుద్రుడి ప్రతినిధి అంటున్నాడు, అది నిజమేనా?" అని అడిగాడు.

"నిజమే, నాయనా! యాగశేషం న్యాయంగా రుద్రుడిదే," అన్నాడు తండ్రి.

నాభాగుడు తిరిగి వచ్చి, ఆ నల్లని మనిషితో, "యాగశేషం రుద్రుడిదేనని మా తండ్రి కూడా చెప్పాడు. అందుచేత ఈ గోధనాన్ని నువ్వే తీసుకుపో. నే నభ్యంతరపెట్టను," అన్నాడు.

"నువ్వూ, నీ తండ్రీ నిజమైన సత్యవాదులు. నువ్వు గొప్ప బ్రహ్మజ్ఞానివీ, కీర్తిమంతుడివీ అవుతావు. ఈ గోధనాన్ని నువ్వే తీసుకుపో," అంటూ ఆ నల్లనివాడు అంతర్ధానమైనాడు.





# రోజులు బాగుంటే

ఒక గ్రామంలో ఒక రైతుకు ఒక కొడుకు ఉండేవాడు. వాడి పేరు భీముడు. తండ్రి బతికున్నంత కాలమూ వాడు తినటమూ తిర గటమూ తప్ప ఇంకేపనీ చెయ్యలేదు. తెలివి తేటలుండీ, వాడు బతుకు తెరువుకు ఒక్క విద్యా నేర్చుకో లేదు.

తండ్రి పోయాక వాడు తన కాళ్ళ మీద తాను నిలబడవలసిన అవసరం ఏర్పడింది. అందుచేత వాడు తనకు తండ్రి వదిలి పోయిన అయిదు వరహాలూ తీసుకుని మొదట వడ్రంగులపాలెం వెళ్ళాడు. అక్కడి వాళ్ళకు రెండు వరహాలిచ్చి పొద్దున నుంచి సాయంకాలం లోపుగా వడ్రంగ మంతా నేర్చుకున్నాడు. మర్నాడు శిల్పిపల్లెకు వెళ్ళి ఆ సాయంకాలం లోపల శిల్పవిద్య నేర్చుకుని, శిల్పులకు రెండు వరహాలిచ్చి, మూడోనాటికల్లా ఒక వరహా మిగుల్చుకుని తన స్వగ్రామం చేరు కున్నాడు. అక్కడ వాడు వడ్రంగిగానూ, శిల్పిగానూ కూడా పని చేస్తూ సుఖంగా జీవించటం ప్రారంభించాడు.

ఇంతలో రాజుగారి పుట్టిన రోజు వచ్చింది. భీమన్న రాజుగారికి మంచి బహుమానం ఇవ్వాలని నిశ్చయించుకుని, మంచిగంధం చెక్కతో చక్కని పెట్టె తయారు చేసి, దానికి నగిషీలు చెక్కాడు. తరవాత చలవ రాయితో ఒక ముచ్చటైన విగ్రహం తయారు చేశాడు. దాన్ని ఒక వైపు నుంచి చూస్తే విష్ణువు కనిపిస్తాడు, రెండో వైపు నుంచి శివుడు కనిపిస్తాడు. ఆ విగ్రహాన్ని మంచి గంధం పెట్టెలో పెట్టుకుని, భీమన్న రాజు గారికి బహుమానంగా పట్టుకుపోయి, పుట్టినరోజు పండగనాడు ఇచ్చేశాడు.

రాజుగారు ఆ బహుమానం చూసి చాలా సంతోషించాడు. ఆయన భీమన్న పనితనం చూసి మెచ్చుకుని, అయిదువేల వరహాలు

కె. ఆనంద్



బహుమానంగా ఇచ్చారు. భీమన్న ఆ బహుమానం అందుకుని మర్నాటికల్లా తన గ్రామానికి తిరిగి వచ్చాడు.

బహుమానం పొందిన భీమన్నను చూసి పొరుగు గ్రామంలో ఉండిన మరొక శిల్పికి ఈర్ష్య కలిగింది. అతను ఇంకా హెచ్చు బహుమానం రాజుగారి నుంచి పొందాలనుకుని, తమ దేశపు రాజుగారు శత్రు రాజును ఓడించి చంపుతున్నట్టుగా ఒక శిల్పం తయారు చేసి, ఒక వడ్రంగి చేత ఆ శిల్పానికి తగినట్టుగా ఒక పెట్టె చేయించి, పెట్టెతో సహా ఆ శిల్పాన్ని పట్టు కెళ్ళి రాజుగారికి సమర్పించాడు.

రాజుగారు ఆ శిల్పాన్ని చూడగానే మండిపోయాడు. చుట్టూ ఉన్నవాళ్ళు హాహా కారాలు చేశారు. ఎందుచేతనంటే, చంపబడుతున్న మనిషి ముమ్మూర్తులా రాజుగారి లాగున్నాడు, చంపుతున్న మనిషిలో రాజుగారి పోలికలేవీ కనిపించలేదు.

రాజుగారు ఆ శిల్పాన్ని అక్కడే పగలగొట్టించి, శిల్పికి యాభై కొరడా దెబ్బలు బహూకరించి పంపేశాడు. ఆ శిల్పికి భీమన్న మీద ఉండిన ఈర్ష్య క్రోధంగా మారింది. అతను ఒక రాత్రి భీమన్న ఉండే ఇల్లు కాస్తా తగల బెట్టించేశాడు. ఇంటితోబాటు భీమన్న కున్న ఆస్తి పాస్తులన్నీ బూడిద అయిపోయాయి.

తన పని మొదటికి వచ్చేసరికి భీమన్న తిరిగి వడ్రంగం చేనుకుని బతక నిశ్చయించి, కలప కొట్టుకు రావటానికి, గొడ్డలి తీసుకుని అడవికి వెళ్ళాడు. అతను రాళ్ళ గుట్టల మధ్యగా నడుస్తూండగా ఒక రాయి తగిలి, కాలిగోరు ఊడి, చాలా బాధ పెట్టింది. భీమన్న కోపంతో ఆ రాతిని సత్తువ కొద్దీ పక్కకు నెట్టాడు. ఆ రాతి కింద విచిత్రంగా ఒక పలకరాయి కనిపించింది.

కొండరాళ్ళ కింద, ఎవరో పెడితే తప్ప, పలకరాయి ఎందు కుంటుందనుకుని,

భీమన్న ఆ పలకరాయి మీద ఉన్న మరి కొన్ని రాళ్ళు కూడా తొలగించి, పలకరాతిని ఎత్తేసరికి, దాని కింద ఒక గుంటా, ఆ గుంటలో బోలెడన్ని నగలూ, డబ్బూ ఉన్నవి. అదంతా దొంగలు దాచుకున్న సొత్తయి ఉండాలనుకుని, భీమన్న దాన్ని పదిలంగా తీసి, మూట కట్టుకుని, ఇంటికి తిరిగి వచ్చేశాడు.

భీమన్న రెండోసారి భాగ్యవంతు డయే సరికి గ్రామాధికారికి కన్ను కుట్టింది. ఆయన భీమన్నను పిలిచి, "నువ్వు హఠాత్తుగా గొప్ప ధనికుడవైనట్టు విన్నాను. నీకా డబ్బంతా ఎక్కడిది?" అని అడిగాడు.

"అడివి మధ్య గుట్టల్లో దొరికింది," అని భీమన్న ఉన్నమాటే చెప్పాడు.

వెంటనే గ్రామాధికారి, "ఎంత పొరపాటు చేశావు! నిధి నిక్షేపాలు రాజుగారి సొత్తు. అందులో చిల్లిగవ్వ ముట్టుకున్నా నిన్ను తీవ్రంగా దండించే హక్కు నాకున్నది. జరిగిందేదో జరిగింది, అదంతా తెచ్చి నా కిచ్చెయ్యి, నేను దాన్ని రాజుగారి ఖజానాకు తరలించేస్తాను," అన్నాడు.

భీమన్న తనకు దొరికినది యావత్తూ గ్రామాధికారి ఇంటికి చేర్చాడు. గ్రామాధికారి అందులో కొంత తాను ఉంచుకుని మిగిలినది రాజుగారికి పంపించేశాడు.





భీమన్నకు మటుకు సాటి మనుషుల పైనా, తన గ్రామం పైనా రోత పుట్టు కొచ్చింది. తన దగ్గిర విద్య ఉన్నది. ఏ దేశం పోయినా తాను హాయిగా బతక గలడు. అందుచేత అతను తన పరికరాలు తీసుకుని మరొక రాజ్యానికి బయలుదేరాడు.

అరణ్యం మధ్య అతనికి అనేక గ్రామాలు తగిలాయి. ఒక గ్రామంలో తింటూ, మరొక గ్రామంలో పడుకుంటూ భీమన్న చాలా రోజులు ప్రయాణం చేసి, ఒక రోజు చీకటి పడేవేళకు ఒక గ్రామం చేరాడు. అక్కడ ఒక ఇంటి నుంచి సన్నగా రోదన ధ్వని వినవస్తున్నది.

భీమన్న ఆ ఇంట్లోకి తొంగి చూసేసరికి ఒక పదహారేళ్ళ పిల్ల ఏడుస్తూ కనిపించింది.

"ఏమమ్మాయి ? ఎందు కేడుస్తున్నావు? ఈ ఇంట్లో నువ్వు ఒక్కతెవే ఉన్నట్టున్నావు? నీ కెవరూ లేరా ?" అని అడిగాడు భీమన్న.

"నన్ను చిన్నతనంలోనే దొంగ లెత్తుకు పోయి ఈ అరణ్యంలో వదిలేశారు. నన్నీ యింటి వాడు పెంచి పెద్దదాన్ని చేశాడు. ఈ ఉదయం ఆయన కూడా చచ్చి పోయాడు. నా కిప్పు డెవరూ లేరు. ఏడవటం తప్ప నా కిప్పు డింకేమీ మిగలలేదు," అన్నదా పిల్ల. ఆమె తన అసలు తలిదండ్రు లెవరో చెప్పలేకపోయింది.

"దిక్కు లేని దానివైతే నా వెంట వచ్చెయ్యి. మనం వివాహం చేసుకుని ఎక్కడైనా కాపరం పెట్టుకుందాం," అన్నాడు భీమన్న.

భీమన్న ఈ మాట అన్నాక ఆమెకు ప్రాణం లేచి వచ్చినట్టయింది. ఆమె లేచి వంట చేసింది. ఆమెనే పరీక్షగా చూస్తున్న భీమన్నకు ఆమె ఎడమకాలి మీద గాయం మచ్చ కనపడింది. వెంటనే తన చిన్న తనంలో విన్న కథ ఒకటి జ్ఞాపకం వచ్చింది.

తమ దేశపు రాజు కొక కూతురుండేది. నాలుగేళ్ళ పిల్ల అయి ఉండగా ఆ పిల్ల

కనిపించకుండా పోయింది. ఆమె కోసం ఎంతో వెతికించారు గాని ప్రయోజనం లేక పోయింది. ఆ పిల్లకు ఎడమకాలి మీద కత్తిగాటు మచ్చ ఉండేదని చెప్పుకున్నారు. ఈ పిల్ల వయసునుబట్టి చూసినా, రాజు కూతురే అయి ఉండవచ్చునని భీమన్నకు తోచింది. ఆమె నిజంగా రాజు కూతురైతే ఆమెను తాను పెళ్ళాడటం అక్రమమవుతుంది. ఆమెను రాజుగారికి అప్పగించటమే తన ప్రథమ కర్తవ్యం.

అందుచేత భీమన్న ఆ పిల్లను తన వెంట తీసుకుని రాజధానికి బయలుదేరాడు. చిన్నతనం నుంచి దాచుకున్న తన బట్టలూ, వస్తువులూ ఆ అమ్మాయి తనవెంట తెచ్చుకున్నది. వాటిని చూసి రాజుగారు తన కుమార్తెను సులువుగా పోల్చుకున్నాడు. పన్నెండేళ్ల క్రితం పోయిన పిల్ల దొరికినందుకు రాజభవనంలో చెలరేగిన ఉత్సాహానికి అంతులేదు. తన కుమార్తెను తనకు చేర్చినందుకు భీమన్నకు ఏమి బహుమానం ఇవ్వాలా అని రాజుగారు వితర్కించుకుంటూ ఉంటే రాజకుమార్తె, తనను అతనికిచ్చి పెళ్లి చేయమన్నది.

"అతనిలో ఏ కోశానా స్వార్థం లేదు. నేను దిక్కులేని దాన్నిగా ఉన్నప్పుడతను తనను పెళ్ళాడమన్నాడు, నేను సరే నన్నాను. తరవాత నా కాలి మీది మచ్చ చూసి అనుమానం కలిగి, అతను నన్ను ఇక్కడికి తెచ్చాడు. అతను నన్ను మరొక చోటికి తీసుకుపోయి పెళ్ళాడి ఉంటే ఎవరూ ఆపి ఉండలేరు," అన్నది రాజకుమార్తె.

తన కుమార్తెకు భీమన్న పట్ల చాలా గౌరవం ఉన్నదని గ్రహించి, రాజుగారు ఆమెను భీమన్నకే ఇచ్చి పెళ్ళి చేశాడు. ఈ వార్త తెలియగానే భీమన్న ఉండిన ఊళ్లోని గ్రామాధికారి సన్యాసం పుచ్చుకున్నాడు; పొరుగూళ్లో ఉండిన శిల్పి దేశాంతరాలు పట్టిపోయాడు.






# విష్ణుమాయ

ధ్రువుడు తీవ్రమైన తపస్సు చేసేటప్పుడు ఇంద్రుడు అతని తపస్సు భగ్నం చెయ్యగోరి విరధుడనే గంధర్వుణ్ణి రాక్షసరూపంలో పంపాడు. తపస్సులో ఉన్న ధ్రువుణ్ణి రాక్షసరూపంలో వచ్చి భయపెడుతున్న విరధుణ్ణి చూసి ఒక ముని కోపగించి, "నువ్వు నిజంగానే రాక్షసుడివి అయిపో," అని శపించాడు.

ఆ విధంగా విరధుడు తన దేవత్వాన్ని కోల్పోయి, శబరీ నదీ తీరాన్ని అంటిపెట్టుకుని, దొరికిన మనుషులను చంపి తింటూ రాక్షస జీవితం గడపసాగాడు. అన్నివిధాలా విరధుడు రాక్షసుడే గాని అతనికి దివ్యదృష్టి మాత్రం ఉండేది. మూడు లోకాలలోనూ ఎక్కడ ఏమి జరిగేదీ అతనికి తెలిసేది.

శబరీ గోదావరీ సంగమం వద్ద ఒక ఆశ్రమంలో కొందరు మునులుండేవారు. అక్కడి మునిబాలకులు కొందరు ఒకనాడు అడవిలో సమిధలు ఏరటానికి వచ్చారు ఆ సమయంలో విరధుడు అక్కడికి వచ్చాడు. వాణ్ణి చూడగానే మునిబాలకు లందరూ భయపడి పారిపోయారు. కాని భరతు డనే కుర్రవాడు మాత్రం ధైర్యంగా నిలబడ్డాడు. ఆ కుర్రవాడి ధైర్యం విరధుణ్ణి ఆశ్చర్యపరిచింది.

పారిపోయిన మునిబాలకులు భరతుడి తండ్రితో, "మీ వాడు రాక్షసుడికి దొరికిపోయాడు," అని చెప్పారు. భరతుడి తండ్రి పరిగెత్తుకుంటూ వచ్చి తన కొడుకును వశపరచుకున్న విరధుణ్ణి చూసి, "నాకు వాడొక్కడే కొడుకు. కావలిస్తే నన్ను భక్షించి, వాణ్ణి విడిచిపెట్టు," అని బతిమాలుకున్నాడు.

"ఒక పని చేద్దాం. నాతో పాచికలు ఆడి గెలు. నీ కొడుకును విడిచి పెడతాను," అన్నాడు విరధుడు.

యస్. యస్. నారాయణ

భరతుడి తండ్రి అతనితో పాచికలు ఆడి ఓడిపోయాడు.

"నీ కింకొక అవకాశం ఇస్తాను. రేపు ఉదయం మళ్ళీ వస్తాను. ఈలోపుగా నీ కొడుకును నేను తెలుసుకో లేని చోట దాచు. మరెన్నడూ వాడి జోలికి రాను," అన్నాడు విరధుడు.

భరతుణ్ణి అతని తండ్రి ఆశ్రమానికి తీసుకుపోయి, తన కొడుకును రక్షించుకోవటానికి తన తపశ్శక్తి యావత్తూ ధారపోయ సంకల్పించాడు. ఆయన హోమం చేసి, బ్రహ్మను ప్రార్థించాడు. బ్రహ్మ అతడికి ప్రత్యక్షమయాడు.

"నా కొడుకును రాక్షసుడి కంట పడకుండా రేపు ఉదయం దాకా దాచి వాడి ప్రాణాలు కాపాడు," అని భరతుడి తండ్రి బ్రహ్మను వేడుకున్నాడు.

బ్రహ్మదేవుడు భరతుణ్ణి తన లోకానికి తీసుకుపోయి, తన ఆసనమైన పద్మంలో ఒక రేకుగా మార్చాడు.

మర్నాడు ఉదయం విరధుడు వచ్చి భరతుడి తండ్రితో, "మూర్ఖుడా, నీ కొడుకును బ్రహ్మదేవుడు తన ఆసనంలోని పద్మంలో ఒక రేకు కింద మార్చి దాస్తే నేను కనుక్కో లేననుకున్నావా? ఈ సారి ఓడిపోయావు. నీకు మరొక అవకాశం ఇస్తు



న్నాను. ఈ సారి మరింత బాగా నీ కొడుకును దాచు. రేపు ఉదయం మళ్ళీ వస్తాను," అని వెళ్ళిపోయాడు.

ఈ సారి భరతుడి తండ్రి శంకరుణ్ణి ప్రార్థించాడు. శంకరుడు ప్రత్యక్షమయాడు. బ్రహ్మను వేడుకున్నట్టే శంకరుణ్ణి కూడా వేడుకున్నాడు భరతుడి తండ్రి.

శంకరుడు భరతుణ్ణి కైలాసానికి తీసుకుపోయి, ఒక కలవపువ్వుగా మార్చి, పార్వతి చెవిలో అమర్చాడు.

విరధుడు మర్నాడు ఉదయం వచ్చి, "నీ కొడుకు కైలాసంలో పార్వతీదేవి చెవిలో కలవపువ్వు రూపంలో దాగి ఉన్నాడు. నేను తెలుసుకున్నాను. వాణ్ణి దాచటాని కింకా ఒక్క అవకాశం ఇస్తున్నాను. ఇదే ఆఖరి అవకాశం," అంటూ వెళ్ళిపోయాడు.

ఆ రోజు భరతుడి తండ్రి విష్ణువును ఆరాధించి, ప్రత్యక్షం చేసుకుని, బ్రహ్మనూ, శంకరుణ్ణీ కోరినట్టే విష్ణువును కూడా అర్థించాడు. విష్ణువు భరతుణ్ణి వెంట బెట్టుకుని వెళ్ళిపోయాడు.

మర్నాడు విరధుడు వచ్చాడు. అతను తన సూక్ష్మదృష్టితో మూడులోకాలూ గాలించాడు, కాని భరతుడు ఎక్కడ ఉన్నదీ తెలియరాలేదు. అతను ఆవేశంతో, "ముని బాలకా, ఎక్కడ ఉన్నావురా?" అని అరిచాడు.

"ఇక్కడే ఉన్నాను," అని భరతుడి కంఠం అస్పష్టంగా జవాబిచ్చింది.

"నిన్నేమీ చెయ్యను. నా ఎదటికిరా!" అన్నాడు విరధుడు.

వెంటనే విరధుడి గుండెను చీల్చుకుని భరతుడు బయటికి వచ్చాడు. రాక్షసుడు చచ్చి పడిపోయాడు. దానితో విరధుడి శాపం తీరి పోయింది. అతను తిరిగి గంధర్వుడై, భరతుడి తండ్రికి నమస్కరించి స్వర్గానికి తిరిగి వెళ్ళిపోయాడు.





# దొంగసాక్ష్యం

ఒక బ్రాహ్మణుడు తన గ్రామం నుంచి కాలిబాటన సమీపంలో ఉన్న మరొక గ్రామానికి పోతూ ఉండగా ఒక మనిషి నెత్తిన నూనెబిందె పెట్టుకుని ఎదురు వచ్చాడు. బిందెలోది నూనె అని తెలిసి బ్రాహ్మణుడు, "ఆ నూనె ఎంతకిస్తావు?" అని అడిగాడు.

"తొమ్మిది రూపాయలు," అన్నాడు నూనెవాడు.

"అయిదు రూపాయల కిస్తావా?" అన్నాడు బ్రాహ్మణుడు.

"ఈ బిందెడు నూనే నీకు అయిదు రూపాయల కివ్వాలా? ఇది కొనే మొహమేనా? పద పద! మూడు రూపాయల కిచ్చినా కొనలేవు నువ్వు!" అంటూ నూనెవాడు నోరు పారేసుకున్నాడు.

బ్రాహ్మణుడికి కోపం వచ్చింది. ఆయన నూనెవాడితో, "నా యిష్టం వచ్చిన ధరకు నే నడుగుతాను. గిట్టితే ఇస్తావు, లేకపోతే నీ దారిన నువ్వు పోతావు! అంతేగాని మాట మర్యాద లేకుండా ఇష్టం వచ్చినట్టు మాట్లాడతావా? ఏమన్న మనిషివి?" అంటూ, చేతు లూపుతూ మీది మీదికి వచ్చాడు. బ్రాహ్మడి చెయ్యి తగిలి ఎక్కడ నూనెబిందె పడిపోతుందో నని నూనెవాడు తల వెనక్కు లాక్కున్నాడు. మరుక్షణం నూనెబిందె కింద పడింది. నూనె అంతా నేలపాలయింది గాక, బిందె కూడా సొట్టబడి పోయింది.

బ్రాహ్మణుడు నూనెవాడికి తగిన శిక్ష అయిందనుకుని సంతోషిస్తూ గబగబా సాగిపోయాడు. నూనెవాడు మాత్రం జరిగిన నష్టానికి గుడ్లనీళ్ళు కుక్కుకుంటూ అక్కడే చతికిలబడి పోయాడు.

ఇంతలో అటుగా అర్జును డనేవాడు వచ్చి, నేలపాలైన నూనెనూ, నూనెవాణ్ణీ

బి. విశ్వేశ్వరరావు



చూసి, "ఏం జరిగింది ?" అని అడిగాడు. నూనెవాడు ఏడుస్తూ అతడికి జరిగింది జరిగినట్టే చెప్పాడు.

అంతా విని అర్జునుడు, "ఇంత నష్టం జరిగితే నీ గతి ఏం కాను ? న్యాయాధికారి దగ్గిర నేను చెప్పినట్టు ఫిర్యాదు చేస్తివా, నీకు నూనె ఖరీదూ, బిందె ఖరీదూ కూడా వస్తుంది. నీ తరఫున నేను సాక్ష్యం చెబుతాను. సాక్ష్యం చెప్పినందుకు నాకో అయిదు రూపాయ లియ్యి, చాలు !" అన్నాడు.

"ఎట్లా ఫిర్యాదు చెయ్యా లంటావు ?" అని నూనెవాడు అడిగాడు. అర్జునుడు చెప్పాడు. తన ఫిర్యాదు నెగ్గుతుందని నూనెవాడికి తోచింది. వాడు వెళ్ళి న్యాయాధికారి దగ్గిర ఫిర్యాదు చేశాడు. న్యాయాధికారి నౌకర్ల చేత బ్రాహ్మణుణ్ణి కూడా న్యాయస్థానానికి పిలిపించి, నూనెవాణ్ణి ఏం జరిగిందీ చెప్పమన్నాడు.

"నేను నూనెబిందె నెత్తిన పెట్టుకుని పక్క గ్రామానికి పోతూండగా ఈ బ్రాహ్మడు ఎదురుపడి, నూనె ధర అడిగాడు. నేను తొమ్మిదిరూపాయ లన్నాను. మూడురూపాయల కియ్యమని అడిగాడు. నాకు గిట్టుబాటు కాదన్నాను. గిట్టుబాటు చేయిస్తానుండు అంటూ ఈ బ్రాహ్మడు నా నెత్తి మీద ఉన్న నూనెబిందెను కింద పడదోసి, నన్ను చావగొట్టాడు. ఇంతలో అర్జును డనే వాడు అటుగా వస్తూ ఇదంతా చూసి, నా ప్రాణం కాపాడాడు. లేకపోతే ఈ బ్రాహ్మడు నా ప్రాణం తీసి ఉండును," అన్నాడు నూనెవాడు.

"నువేమంటావయ్యా, బ్రాహ్మడా ?" అని న్యాయాధికారి అడిగాడు.

బ్రాహ్మడు జరిగినది జరిగినట్టు చెప్పాడు.

"నీ కెవరన్నా సాక్షు లున్నారా ?" అని న్యాయాధికారి బ్రాహ్మణ్ణి అడిగాడు.

"ఇది జరిగినప్పుడు అక్కడ ఎవరూ లేరు, మహాప్రభో !" అన్నాడు బ్రాహ్మడు.



తరవాత అర్జునుడు సాక్ష్యం చెబుతూ, నూనెవాడు చెప్పిన ప్రతి అక్షరమూ బల పరిచాడు. ఫిర్యాదుకు సాక్ష్యాధారం ఉన్నందున న్యాయాధికారి బ్రాహ్మడి చేత నూనెవాడికి ఇరవైఅయిదు రూపాయలు నష్టపరిహారం ఇప్పించాడు.

న్యాయస్థానం దాటి ఇవతలికి వచ్చాక అర్జునుడు నూనెవాడితో, "నా సలహా ఎంత లాభించిందో చూశావా? ఇక నేను వెళతాను. నా అయిదురూపాయలూ నాకు పారెయ్యి," అని అడిగాడు.

మోసం రుచిమరిగిన నూనెవాడు, "ఇంకేం అయిదురూపాయలు? ముందే తీసుకుంటివిగా?" అన్నాడు.

అర్జునుడికి పట్టరాని కోపం వచ్చింది. వాడు పరిగెత్తుకుంటూ వెళ్ళి, తన గ్రామానికి తిరిగి పోతున్న బ్రాహ్మణ్ణి కలుసుకుని, "అయ్యా, ఆ న్యాయాధికారి పరమదుర్మార్గుడండి. మీకు ఇంత పెద్ద శిక్ష ఇస్తాడనుకో లేదు. నేను, ఆ నూనెవాడి పక్షాన దొంగ సాక్ష్యం చెప్పానే అనుకోండి. పొట్టకక్కుర్తి కొద్దీ చెప్పాను. కాని, నేను చెప్పినట్టు మీరు ఫిర్యాదు చేశారంటే మీకు జరిగిన అన్యాయం రద్దవుతుంది," అంటూ, ఎలా ఫిర్యాదు చెయ్యాలో చెప్పాడు.



బ్రాహ్మణుడు కొంచెం ఆలోచించి, "నీ ఆలోచన బాగానే ఉంది. ఈ పదిరూపాయలు ఉంచుకో," అంటూ అర్జునుడికి పదిరూపాయ లిచ్చాడు.

ఇద్దరూ కలిసి మళ్ళీ న్యాయస్థానానికి వెళ్ళారు. న్యాయస్థానం నుంచి వెళ్ళిపోయేటప్పుడు నూనెవాడు తనను కొట్టాడనీ, అర్జునుడే తనను కాపాడాడనీ బ్రాహ్మడు ఫిర్యాదు చేశాడు.

న్యాయాధికారి . నూనెవాణ్ణి పిలిపించి, "నీకు జరిగిన అన్యాయానికి పరిహారం ఇప్పిస్తిని కదా, మళ్ళీ బ్రాహ్మణ్ణి ఎందుకు కొట్టావు?" అని అడిగాడు.



"నేను కొట్టలేదండి. నే నా బ్రాహ్మణ్ణి మళ్ళీ చూడను కూడా లేదు," అన్నాడు నూనెవాడు.

కాని, నూనెవాడు బ్రాహ్మణ్ణి చంపబోయి నట్టూ, తాను అడ్డపడి బ్రాహ్మణ్ణి కాపాడి నట్టూ అర్జునుడు సాక్ష్యం చెప్పాడు.

"ఇప్పుడే మంటావు?" అన్నాడు న్యాయాధికారి నూనెవాడితో.

"అయ్యా, వాళ్ళమాటలు నమ్మకండి. నాకు తమరు పరిహారం ఇచ్చారన్న కోపంతో ఈ ఇద్దరూ కలిసి ఈ అబద్ధం సృష్టించారు," అన్నాడు నూనెవాడు.

"బ్రాహ్మడు అబద్ధం సృష్టించాడంటే నమ్మవచ్చు. కాని ఈ సాక్షి ఇంతకు ముందు నీ సాక్షే కద? ఇత నెందుకు అబద్ధం చెబు తాడూ?" అన్నాడు న్యాయ్యాధికారి.

నూనెవాడు చిక్కులో పడ్డాడు.

అప్పుడు బ్రాహ్మణుడు న్యాయాధికారితో, "తమకు కావలిసింది సాక్ష్యమే గాని, నిజం కాదనుకున్నాను. ఈ మనిషి చెప్పిన అబద్ధం సాక్ష్యం ఆధారం మీదేగద నాచేత ఈ నూనెవాడికి ఇరవై అయిదు రూపాయలు పరిహారం ఇప్పించారు. ఇతను ఈ సారి నాచేత ఫిర్యాదు చేయించి తాను సాక్ష్యం చెబుతానని, ముందుగానే నా దగ్గిర పది రూపాయలు పుచ్చుకున్నాడు. ఈ సారి కూడా తమరు సాక్ష్యం ఆధారంతోనే నాకు ఆ నూనెవాడి వద్దనుంచి డబ్బు ఇప్పించాలి," అని విన్నవించుకున్నాడు.

న్యాయాధికారికి పది మందిలోనూ తల తీసేసినట్టయింది.

అర్జునుణ్ణి సొదాచేస్తే పదిరూపాయలు దొరికాయి. నూనెవాడు కూడా తాను చేసిన ఫిర్యాదు తప్పుడు ఫిర్యాదేనని ఒప్పు కోక తప్పలేదు.

న్యాయాధికారి బ్రాహ్మడి డబ్బు బ్రాహ్మడి కిప్పించి, దొంగ సాక్ష్యం చెప్పినందుకు అర్జునుణ్ణి కారాగృహంలో పెట్టించాడు.





# బాకీ వసూలు

ఒక ఊళ్ళో షావుకారు సంగప్ప అనే ధన వంతు డుండేవాడు. అతను అడిగిన వాడికి లేదనకుండా అప్పు లిచ్చి, ఇచ్చిన బాకీలను అతి తెలివిగా వసూలు చేసుకునేవాడు.

ఇంకో గ్రామంలో మరొక ధనికు డుండే వాడు. అతని పేరు నందప్ప. నందప్పకు సంగప్పను గురించి తెలియవచ్చింది. "ఈ సంగప్ప పత్రాలూ, సాక్ష్యాలూ లేకుండా ఇచ్చిన అప్పులు కూడా వసూలు చేస్తాడట. ఎలా చేస్తాడో చూడాలి," అనుకున్నాడు నందప్ప.

నందప్ప సంగప్ప ఉండే ఊరికి వచ్చి, "మాది ఫలానా ఊరు. నా పేరు నందప్ప. అవసరంగా నాకు వెయ్యి రూపాయలు కావలిసొచ్చింది. మీరు అప్పిస్తే తీసుకు పోదామని వచ్చాను," అన్నాడు సంగప్పతో.

సంగప్ప నందప్పను గురించి కూడా విని ఉన్నాడు. నందప్ప న్యాయాన్ని తారు మారు చెయ్యటంలోనూ, పేచీలు సృష్టించడంలోనూ సిద్ధహస్తుడట. అతను ఎలాటి పేచీలు వేస్తాడో చూతామని సంగప్పకు అనిపించింది. అతను నందప్పకు వెయ్యి రూపాయలూ అప్పుగా ఇచ్చాడు; బాకీ తిరిగి ఎప్పుడు తీర్చుతావని కూడా సంగప్ప నందప్పను అడగలేదు.

ఒక ఏడాది గడిచింది. ఏడాది క్రితం తీసుకున్న బాకీ పూర్తిగా గాని, కొంతగా గాని చెల్లించమని కోరుతూ ఉత్తరం రాసి, సంగప్ప తన ఇంటి నౌకరు ద్వారా నందప్పకు పంపాడు.

ఆ ఉత్తరం చూసుకుని నందప్ప, "నేను మీకు బాకీ ఉన్న మాట నిజమే. కాని దాన్ని ఇప్పుడు తీర్చలేను. తుమ్మ విత్తనాల కోసం పోతున్నాను. తిరిగి వచ్చాక మీ బాకీ తీర్చుతాను," అని సమాధానం రాసి పంపాడు.



ఇంకొక సంవత్సరం గడిచింది. నందప్ప బాకీలో కొంత అయినా చెల్లువెయ్యలేదు. సంగప్ప మళ్ళీ ఉత్తర మిచ్చి మనిషిని పంపాడు. తానింకా తుమ్మవిత్తనాలకు పోలేదనీ, పోయి వచ్చిన తరవాత సొమ్ము తప్పక ఇస్తాననీ నందప్ప తిరిగి జవాబు రాసి పంపాడు.

నందప్ప తుమ్మవిత్తనాలకు పోవటానికీ, బాకీ చెల్లు పెట్టటానికి సంబంధం ఏమిటో సంగప్పకు అంతు చిక్కలేదు. ఆ రహస్యం తెలుసుకుందామనే ఉద్దేశంతో అతను స్వయంగా బయలుదేరి వెళ్ళి, నందప్పను కలుసుకుని, "మీరు తుమ్మవిత్తనాలకు వెళ్ళి వచ్చాక నా పైకం ఇస్తానని చెబుతున్నారు గదా, ఈ రెండిటికీ ఏమిటి సంబంధం?" అని అడిగాడు.

"కొండ మీద తుమ్మచెట్లున్నాయి. వాటి కింద తుమ్మ విత్తనాలు రాలి పడి ఉంటాయి. నేను వెళ్ళి ఆ విత్తనాలు ఏరి తెచ్చిపెట్టుకోవాలి. తెట్టురాళ్ళ నుండి గుట్ట రాళ్ళ దాకా బాట వేస్తారట. బాటకు రెండు వేపులా తుమ్మవిత్తులు నాటాలి. అవి మొలిచి, తుమ్మచెట్లు పెరిగి పెద్దవి కావాలి. బాట వెంబడి బళ్ళ మీద పత్తి వెళ్ళేటప్పుడు కొంత పత్తి కొమ్మలకు తగులుకుంటే ఆ పత్తి అమ్మి నేను మీ బాకీ తీర్చాలి. అందుచేత నేను తుమ్మవిత్తనాలకు వెళ్ళటానికీ, మీ బాకీకి సంబంధం లేకపోలేదు," అన్నాడు నందప్ప.

"అదా సంగతి? ఇప్పుడంతా అర్థమై పోయింది," అంటూ సంగప్ప నందప్ప దగ్గిర సెలవు పుచ్చుకుని తన ఊరు వచ్చేశాడు.

తరవాత చాలా కాలం గడిచిపోయింది. సంగప్ప ఓడిపోయాడనే నందప్ప అనుకున్నాడు. ఒకనాడు సంగప్ప నందప్పను తన ఇంట చేసుకుంటున్న సత్యనారాయణ వ్రతానికి సకుటుంబంగా రావలసిందని ఆహ్వానించాడు.

ఏం చేస్తే బాగుంటుందా అని నందప్ప ఆలోచించాడు. ఆహ్వానం అందుకుని వెళ్లక పోతే తాను భయపడినట్టవుతుంది. తాను వెళ్ళితే, ఆ సంగప్ప నలుగురి మధ్యా తన బాకీ మాట చెప్పి తనను నగుబాటు చెయ్య వచ్చు. తాను పోకపోతే తన భార్య ఒంట రిగా వెళ్ళదు. అన్ని విధాలా అనుకూలంగా ఉంటుందని నందప్ప తన ముసలితల్లిని మాత్రమే సంగప్ప ఇంటికి పంపాడు.

సంగప్ప ఆమెతో, "అమ్మా, చాలాకాలం క్రితం మీ అబ్బాయి నా దగ్గిర అప్పు తీసు కున్నాడు. బాకీ చెల్లించమని అడిగితే, బాకీ చెల్లిన దాకా మిమ్మల్ని తాకట్టు ఉంచుకో మని పంపాడు. మీ రిక్కడ తాకట్టు ఉన్నట్టు పదిమందికి తెలిస్తే, మీ అబ్బాయి పరువు కాస్తా పోతుంది. అందుచేత నాలుగు రోజుల పాటు మీరు లోపలింట్లో నే ఉండండి. బయటికి రావద్దు. ఆ తరవాత మీ అబ్బాయి డబ్బు తెచ్చి ఇచ్చి మిమ్మల్ని తీసుకుపోతాడు," అన్నాడు.

ముసలావిడ తన కొడుకును తిట్టుకుని సంగప్ప చెప్పినట్టుగా రహస్యంగా ఉంటు న్నది. ఆ తరవాత సంగప్ప ఒక పుకారు లేవ దీశాడు. ఫలాని గ్రామంలో ఉండే నందప్ప తల్లి తన ఇంటికి వచ్చింది, వచ్చిన మనిషి తనను నానా మాటలూ అన్నది, చూసి



చూసి తాను ఆమెను ఒక్కటి పెట్టాడు, ఆ ముసలిది కాస్తా చచ్చింది; చేసేది లేక తాను ఆమెను అర్ధరాత్రివేళ డొంకలో పూడ్చి వచ్చాడు.

ఈ పుకారు నందప్పకు చేరింది. అప్పటికి తన తల్లి వెళ్ళి వారంరోజు లయింది. ఎందుకు తిరిగి రాలేదా అని నందప్ప ఆశ్చర్యపడుతూండగా, సంగప్ప ఆమెను కొట్టి చంపాడన్న వార్త గాలికబురుగా తెలిసింది. నందప్ప ఏమీ తెలియనివాడి లాగా సంగప్ప ఇంటికి వచ్చి, "మా అమ్మను తీసుకుపోవటానికి వచ్చాను," అన్నాడు.

సంగప్ప నిట్టూర్చి, "పాపం, పెద్దది. శరీరాలు శాశ్వతం కావు," అన్నాడు.

నందప్ప ఉగ్రుడైపోయి, "నేను నీ బాకీ చెల్లించలేదని మా అమ్మను హత్యచేస్తావా? ఆవిడను వెంటనే చూపించు," అన్నాడు.

"నన్ను క్షమించాలి. నీ దగ్గిర బాకీ వసూలు చెయ్యటం ఎంత అసాధ్యమో, నేను మీ అమ్మను చూపటం కూడా అంత అసాధ్యమే," అన్నాడు సంగప్ప.

అప్పటికే జనం పోగయారు. నందప్ప వారందరితోనూ, "సంగప్ప అన్న మాటలు మీరందరూ విన్నారు గద! నే నిప్పుడే వచ్చి ఈయన సంగతేమిటో తేలుస్తాను," అంటూ గబగబా తన గ్రామానికి వెళ్ళి, సంగప్ప కివ్వవలసిన వెయ్యిరూపాయలూ తీసుకుని తిరిగి వచ్చి, "ఇదుగో బాకీ సైకం! ఇప్పుడు మా అమ్మను చూపించు. చూపించకపోతే నువు హంతకుడివని నీ మీద ఫిర్యాదు తెస్తాను," అన్నాడు.

సంగప్ప ఆ డబ్బు తీసుకుని లోపలికి వెళ్ళి, ముసలావిడను తీసుకుని బయటికి వచ్చి, "ఇదుగో మీ అమ్మ! తీసుకు వెళ్ళు!" అన్నాడు.

నందప్ప నోట మాట రాలేదు. అతను తన తల్లిని వెంటబెట్టుకుని తన వూరు వెళ్ళిపోయాడు.





# కృష్ణావతారం

ఇంద్రుడూ, కృష్ణుడూ ఇష్టాగోష్ఠి ముగించి, శచీదేవినీ, సత్యభామనూ వెంటబెట్టుకుని అదితిని చూడబోయారు. వారందరూ అదితికి ప్రణామాలాచరించారు. అప్పుడు ఇంద్రుడు ఆమెకు ఆమె కుండలాలు ఇచ్చేస్తూ, కృష్ణుడు నరకుడి పై చూపిన పరాక్రమాన్ని విపరంగా వర్ణించి చెప్పాడు.

అదితి కృష్ణుడికి అనేక వేల దీవన లిచ్చి, "నాయనా, సాటిలేని నీ భుజబలంతో నా కష్టా లన్నిటినీ గట్టెక్కించావు. నీది అపూర్వమైన జన్మ. ఇంద్రుడి లాగే నువు కూడా దేవతలకు అండగా ఉండు. భూమి మీద నిన్నెవ్వరూ జయించలేక పోదురుగాక. స్త్రీలలో ఈ సత్యభామకు ఎవరూ ఈడు రారని ప్రసిద్ధి. నీకీ మానవావతారం ఎంత కాలమైతే ఉంటుందో అంత కాలమూ సత్యభామకు యవ్వనం నిలిచి ఉండు గాక," అని దీవించింది.

తరవాత కృష్ణుడు అదితి వద్దా, ఇంద్రుడి వద్దా సెలవు పుచ్చుకుని, గరుడవాహన మెక్కి, సత్యభామా సమేతుడై నందనవనం మొదలుగా గల దేవోద్యానాలకు వెళ్ళి, అక్కడ విహారాలు చేశాడు. అక్కడ కల్ప వృక్షా లున్నాయి. వాటి పూల మీద తుమ్మెదలు ముసురుతున్నాయి. వాటి కొమ్మలను ఉయ్యాలలు చేసుకుని దేవకన్యలు ఊగుతున్నారు. లోకాలన్నీ తిరిగి వచ్చిన సిద్ధ మిథునాలు వాటి నీడన విశ్రాంతి తీసుకుంటున్నారు. అలాటి కల్పవృక్షాల మధ్య కృష్ణుడు పారిజాతాన్ని చూశాడు. అది దేవ

21. పారిజాతాపహరణం



తలకు మహాపవిత్రమైనది. శచీదేవికి దాని మీద చాలా ప్రీతి. దాని కీర్తి మూడులోకాల లోనూ ప్రసిద్ధమైనది. దానికి సమీపంగా వెళ్ళిన వారికి జాతిస్మరణ కలుగుతుంది.

సత్యభామకు పారిజాత సౌరభం సోకగానే తాను దేవతాస్త్రీలలో అగ్రగణ్యురాలనన్న భావం కలిగింది. ఆమె అమితమైన ఆనందం పొందుతూ, ఆ చెట్టు తనకు కావాలని కృష్ణుణ్ణి వేడుకున్నది.

కృష్ణుడు వెంటనే పారిజాతాన్ని వేళ్ళతో సహా పెల్లగించి గరుత్మంతుడి వీపు మీద పెట్టి, బయలుదేరాడు. అప్పుడు దేవవనాలను కాపాడేవాళ్ళు అడ్డపడి, అతనితో యుద్ధం ప్రారంభించారు. కృష్ణుడు తన బాణాలతో అవలీలగా వాళ్ళను చెండాడాడు. ఈ సంగతి ఇంద్రుడికి తెలిసింది.

కృష్ణుడు మూడులోకాలకూ రక్షకుడని తెలును, అతను పారిజాతం తీసుకుపోవటానికి అభ్యంతరం కూడా లేదు; అయినా ఇంద్రుడు తనను తాను నిగ్రహించుకోలేక, దేవగణాలతో బయలుదేరి కృష్ణుడికి అడ్డం వెళ్ళి, అతని పై వజ్రాయుధం విసిరాడు. కృష్ణుడు దాన్ని దారిలోనే ఆపేశాడు. ఇంద్రుడి ఆటకట్టింది. కృష్ణుడు జీవించి ఉన్నంత కాలమూ పారిజాతం భూలోకంలో ఉండటానికి సమ్మతించి, ఇంద్రుడు తిరిగి వెళ్ళాడు. కృష్ణుడు కూడా ద్వారకకు బయలుదేరాడు.

గరుత్మంతుడు పారిజాతంతో సహా సత్యభామా కృష్ణులను కృష్ణుడి మేడ పైభాగాన దింపాడు. కృష్ణుడు పాంచజన్యం పూరించి, తన రాక తనవారి కందరికీ తెలియబరిచాడు. అందరూ సంభ్రమంతో అతని వద్దకు పరిగెత్తుకుంటూ వచ్చారు. కృష్ణుడు పెద్దలకు నమస్కరించి, చిన్న వాళ్ళను కౌగలించుకుని, పలకరించాడు.

ప్రద్యుమ్నుడు వచ్చి పారిజాతాన్ని అంతః పురంలో చేర్చాడు. దాని సమీపానికి వెళ్లిన

వారందరికీ ఆశ్చర్యంగా పూర్వజన్మజ్ఞానం కలిగింది. దాని మహత్తు చూసి అందరూ ఆశ్చర్యపోయారు. తరవాత దాన్ని తీసుకు పోయి తగిన ప్రదేశంలో నాటారు.

నరకుడు చెరలో ఉంచి, పల్లకీలలో ద్వారకకు చేరిన స్త్రీలందరినీ కృష్ణుడు తానే వివాహమాడాడు.

తరవాత కృష్ణుడు గరుత్మంతుణ్ణి తగిన విధంగా సన్మానించి, ఆతను దేవలోకానికి తిరిగి వెళ్ళటానికి అనుమతి ఇచ్చాడు. ఎప్పుడు తలచుకున్నా రాగలనని మాట ఇచ్చి గరుత్మంతుడు వెళ్ళిపోయాడు.

అనంతరం కృష్ణుడు సభచేసి, నరకుణ్ణి చంపి తాను సంపాదించిన వస్తువులను ఉగ్రసేనుడికీ, అయన భార్యకూ, తదితరులకూ పంచి, మిగిలినది ఖజానాలో పెట్టించాడు.

సత్యభామ రోజూ పారిజాత పుష్పాలతో తనను తాను అలంకరించుకుని, తన సవతులకు కూడా పంచిపెట్టుతున్నది. తన వనంలో పారిజాతం లేకుండా పోయిందని ఇంద్రుడు మాత్రం దీనంగా శచీదేవి కేసి చూస్తూ ఉండేవాడు.

ఒకసారి దుర్యోధనుడు హస్తినాపురంలో ఒక యజ్ఞం చేసి అనేకమంది రాజులను



ఆహ్వానించాడు. యజ్ఞం పరిసమాప్త మయింది. ఆ యజ్ఞానికి వచ్చిన రాజులు కృష్ణుడి విభవాన్ని గురించి ఎంతగానో విని ఉన్నవాళ్ళు కావటంచేత ద్వారకకు వస్తామని దూతద్వారా కృష్ణుడికి కబురుచేశారు. తప్పక రావలసిందిగా కృష్ణుడు తన దూత ద్వారా వారిని ఆహ్వానించాడు. ధృతరాష్ట్రుడి నూరుగురు కొడుకులూ, వారి సామంతులూ, పాండవులూ పద్దెనిమిది అక్షౌహిణుల సేనతో సహా బయలుదేరి వచ్చి, రైవతకాద్రి ప్రాంతంలో విడిశారు.

బలరాముణ్ణీ, సాత్యకినీ, ప్రద్యుమ్నుడు మొదలైన కుమారులనూ, పెద్ద సేననూ



వెంటబెట్టుకుని, కృష్ణుడు తన అతిథులను సన్మానించటానికి వచ్చాడు. అతను అందరినీ గౌరవించి, అందరికీ బట్టలు పెట్టి, "నేనూ, నా వాళ్ళూ మీ వాళ్ళమే. మీకేం కావాలన్నా అడగండి, సమకూర్చుతాం," అని అందరికీ సంతోషం కలిగించాడు. వారంతా కొంతకాలం గడిపి వెళ్ళిపోయారు.

ఒకసారి అర్జునుడు ధర్మరాజు అనుమతితో కృష్ణుణ్ణి చూడవచ్చి ద్వారకలో కొంతకాలం ఉన్నాడు. ఆ సమయంలోనే కృష్ణుడు ఒక యజ్ఞం ప్రారంభించాడు. యజ్ఞం కొనసాగుతూ ఉన్న సమయంలో ఒక పల్లెటూరి బ్రాహ్మణు డక్కడికి వచ్చి, దీక్షలో ఉన్న కృష్ణుడికి ఎదురుగా నిలబడి దీనంగా, "అయ్యా, నా మొర ఆలకించండి. నా భార్య ప్రసవించిన మరుక్షణంలోనే బిడ్డలను ఎవరో కాజేస్తున్నారు. ఈ విధంగా ఇప్పటికి మూడుసార్లు జరిగింది. ఇప్పుడు నాలుగోసారి నా భార్య గర్భవతిగా ఉన్నది. కాన్పు వచ్చే సమయం దగ్గర పడింది. మమ్మల్ని నువే కాపాడాలి," అని మొర పెట్టుకున్నాడు.

ఆ మాటకు కృష్ణుడు, "ఎవరు కాపాడమన్నా వెంటనే ఆ పని చెయ్యటం నా విధి. కాని నేనీ క్షణాన యజ్ఞదీక్షలో ఉండిపోయాను. ఏం చెయ్యాలో తోచకుండా ఉన్నది," అన్నాడు.

ఇదంతా వింటున్న అర్జునుడు, "ఎందుకాలోచన? నన్ను పంపించరాదా? నేనీ బ్రాహ్మణుడి వెంట వెళ్ళి, ఆయనకు కలిగిన ఆపద తొలగించి, నిన్ను సంతోషపెడతాను," అని కృష్ణుడితో అన్నాడు.

కృష్ణుడు చిరునవ్వు నవ్వి, "ఈ పని నీ వల్ల అవుతుందా?" అన్నాడు.

అర్జునుడి కీ మాటతో తల తీసేసినట్టయి, తల వంచుకున్నాడు. అది చూసి కృష్ణుడు, "అయినా ఏంలే, ఒక్కడివీ వెళ్ళకు. బలరాముణ్ణీ, ప్రద్యుమ్నుణ్ణీ, మరి

కొందరు యాదవవీరులనూ, సాత్యకినీ సేననూ వెంటబెట్టుకు వెళ్ళు," అన్నాడు.

అర్జునుడు మిగిలిన యోధులనూ, పెద్ద సేననూ వెంటబెట్టుకుని, బ్రాహ్మణుడు దారి చూపుతూండగా రథంలో బయలుదేరి ఆ బ్రాహ్మణుడి గ్రామం చేరాడు.

అంతలో నక్కలు కూయుటం విన పడింది. ఆకాశాన సూర్యుడి కాంతి క్షీణించి, సాయంకాలం అవుతున్నట్టనిపించింది. భయంకరమైన ధ్వనితో ఉల్క ఒకటి భూమి పైన పడింది. అదే సమయంలో బ్రాహ్మణుడి భార్యకు నొప్పు లారంభ మయాయి. ఆ సంగతి బ్రాహ్మణుడు వచ్చి చెప్పగా మహాయోధు లందరూ విల్లులూ, బాణాలూ సిద్ధంగా పట్టుకుని పురిటింటి దగ్గిర చేరారు.

అర్ధరాత్రి అయింది. బ్రాహ్మణి ప్రసవిం చింది కాబోలు, చంటిబిడ్డ ఏడుపు వినిపిం చింది. అంతలోనే ఆడవాళ్ళు, "అయ్యో, పోయె! పోయె!" అని ఆర్తనాదాలు చేశారు. చంటిబిడ్డ ఏడుపు ఆకాశం దిక్కు నుంచి వినిపించింది.

అర్జునుడూ, మిగిలిన యోధులూ ఆకా శాన్ని బాణాలతో నింపేశారు. ఆకాశాన వారి కేమీ కనిపించలేదు. ఒక్క బాణం కూడా



ఎవరికీ తగలలేదు, అందరూ దిగ్భ్రాంతులై, కొయ్యబారిపోయి నిలబడ్డారు.

ముసలివాళ్ళూ, ముత్తవ్వలూ అర్జునుడు మొదలైన వాళ్ళను నానా మాటలూ అన్నారు. బ్రాహ్మణుడు పట్టరాని కోపంతో అర్జునుడి వద్దకు వచ్చి, "గొప్ప శూరుడి లాగా కృష్ణుడి ముందర ప్రగల్భాలాడి, కార్యభారం మీద వేసుకుని వచ్చావు. కృష్ణుడి వల్ల తప్ప కాని పని నీ వల్ల అవు తుందా? నీకూ అతనికీ సాపత్య మేమిటి? ఇంకెన్నడూ దంభాలు పలుకకు. కాపాడతా నని వచ్చి, కాపాడలేక పోయావు. జరిగిన ధర్మహాని వల్ల కలిగే పాపంలో నీకు



నాలుగో వంతు చెందుతుంది. నీ గాండీవం వృథా, నీ పరాక్రమం వృథా. ఇక చల్లగా వచ్చిన దారి పట్టు," అన్నాడు.

ఆయన వెంటనే కృష్ణుడి దగ్గిరికి మళ్ళీ బయలుదేరాడు. ఆయన వెనకగా అర్జునుడు మొదలైనవాళ్ళు కూడా బయలుదేరారు. సిగ్గుతో తల వంచుకుని, కంట తడిపెట్టుకుంటూ తన ఎదటికి వచ్చి నిలబడిన అర్జునుణ్ణి చూసి కృష్ణుడు, "ఈ మాత్రానికే ఇంత విచారం దేనికి? దీనికంతా వేరే కారణం ఉన్నది. దాన్ని నీకు తరవాత చెబుతాను," అని, దారుకుణ్ణి పిలిచి రథం ఆయత్తపరచమన్నాడు.



దారుకుడు కృష్ణుడి రథానికి శైబ్య, సుగ్రీవ, మేఘపుష్ప, వలాహకాలనే నాలుగు గుర్రాలను పూన్చి, గరుడధ్వజం ఎత్తి తీసుకు వచ్చాడు. అర్జునుణ్ణి రథం తోలమని, కృష్ణుడా రథంలో ఎక్కి, ఉత్తరంగా బయలుదేరాడు. రథం అరణ్యాలనూ, కొండలనూ, నదులనూ దాటి వెళ్ళి సముద్ర తీరాన్ని చేరింది.

సముద్రుడు ప్రత్యక్షమై, కృష్ణుడికి అర్ఘ్యమిచ్చి, "మహానుభావా, ఏమిటి నీ ఆజ్ఞ?" అని అడిగాడు.

"మరేమీ లేదు. నా రథానికి మార్గం ఇయ్యి," అన్నాడు కృష్ణుడు.

దానికి సముద్రుడు, "దేవా, నేను తమకు దారి ఇచ్చినట్టయితే మిగిలిన వారికి తేలిక అయిపోనా? నేను దాటరాని వాణ్ణిగా సృష్టి చేసింది తమరే గద?" అన్నాడు.

"నాతో ఒకరికి పోటీ ఏమిటి? నేను చేసే పనులు మరొకరు చేయగలరా? నా కోసమూ, ఒక బ్రాహ్మణుడి కోసమూ నువ్వు దారి యివ్వక తప్పదు. నేను వెళ్ళిపోయాక దారి మళ్ళీ మూసేసి, ఎప్పటిలాగే ఉండు," అన్నాడు కృష్ణుడు.

సముద్రుడు సమ్మతించి దారి ఇచ్చాడు. కృష్ణుడి రథం ఉత్తర కురుభూములు దాటి

గంధమాదన పర్వతం కేసి వెళ్ళసాగింది. అప్పు డతనికి ఆరు పర్వతాలు-జయంతం, వైజయంతం, నీలం, శ్వేతం, ఇంద్రకూటం, కైలాసం అనేవి—రంగురంగుల ధాతువులతో అలంకరించి ఉన్న శరీరాలతో ఎదురై, "దేవా, ఏమిటి నీ ఆజ్ఞ?" అని అడిగాయి.

"నా రథానికి దారి ఇయ్యండి," అన్నాడు కృష్ణుడు.

అప్పు డా పర్వతాలు ఒదిగి, కృష్ణుడి రథానికి దారి ఇచ్చాయి.

మేఘాల మధ్యగా నడిచే సూర్యుడిలాగా కృష్ణుడి రథం కొండల మధ్యగా చాలా దూరం పోయేసరికి, అంతటా అంధకారం ఆవరించింది. అర్జునుడు భయపడ్డాడు. గుర్రాలు నిలిచి పోయాయి. చుట్టూ రాయిలాగా పేరుకు పోయిన అంధకారాన్ని కృష్ణుడు తన సుదర్శన చక్రంతో ముక్కలు ముక్కలు చేసి, "రథం పోనీ," అని అర్జునుడితో అన్నాడు.

చాలాదూరం వెళ్ళగా, వెళ్ళగా ఎట్టెదట కోటి సూర్యుల కాంతి ఒక్కచోట పోగు చేసినట్టు కనబడింది. కృష్ణుడు రథం దిగి, ఆ కాంతిలోకి వెళ్ళిపోయాడు.

"ఈ వెలుతురేమిటి? ఇందులోకి కృష్ణుడు ఒంటరిగా ఎందుకు పోయాడు? ఏం కానున్నది?" అని అర్జునుడూ, బ్రాహ్మణుడూ భయపడుతూండగానే కృష్ణుడు ఆ కాంతిలో నుంచి తిరిగి వచ్చాడు. అతని వెంట ముగ్గురు బ్రాహ్మణకుమారులూ ఉన్నారు. అతని చేతిలో కొత్తగా పుట్టిన శిశువు కూడా ఉన్నాడు.

కృష్ణు డా పిల్లలు నలుగురినీ బ్రాహ్మణుడి కిచ్చాడు. బ్రాహ్మణుడు పొందిన ఆనందానికీ, అర్జునుడు పొందిన ఆశ్చర్యానికీ మేరలేదు.

రథం వెళ్ళిన దారినే కృష్ణుడి ఇంటికి తిరిగి వచ్చేసింది. కృష్ణు డా బ్రాహ్మణుడికి కానుకలిచ్చి పంపి, యజ్ఞాన్ని పూర్తిచేశాడు.





# అరణ్యపురాణం

## 24

వమౌగ్లి చుట్టూ పరికించి చూసి, నేల మీది నుంచి తళతళా మెరిసే దాన్ని గుప్పిట పైకి తీశాడు.

"ఓహో, మనిషి మందలో ఆటకు ఉపయోగించే వాటి లాగే ఉంది. ఇది పసుపు పచ్చగా ఉన్నది, అవి గోధుమ రంగుగా ఉండేవి. అంతే తేడా," అంటూ అతను బంగారపు ముద్దను కింద పడ నిచ్చాడు. ఆ చీకటి కొట్టులో కొన్ని అడుగుల లోతున వెండి, బంగారు నాణా లున్నాయి. వాటిలో సగం కూరుకుని ఏనుగు అంబారీలున్నాయి. అవి బంగారు రేకుతో తయారు చేసి, రత్నాలు పొదిగినవి. రాజులు ఎక్కి తిరిగిన పల్లకీలున్నాయి. వాటికి వెండి నగిషీలున్నాయి.

తెల్లపడగ చెప్పిన మాట నిజం. ఈ విధికి మూల్యం కట్టడం సాధ్యం కాదు. ఎన్నో శతాబ్దాల మీద యుద్ధాలద్వారానూ, దోపిడీ చేసీ, వర్తకం జరిపీ, పన్నులు వసూలు చేసీ కూడబెట్టిన నిధి ఇది.

అయితే వీటి విలువ మౌగ్లికి కొంచెం కూడా తెలియదు. కత్తులు అతన్ని కొద్దిగా ఆకర్షించాయి. కాని, తన కత్తికున్న "పట్టు" వాటికి లేకపోవటం వల్ల వాటిని జార విడిచేశాడు. చిట్టచివరకు అతని దృష్టిని ఒక అంకుశం ఆకర్షించింది. దాని పిడి చివర ఒక గుండ్రని, పెద్ద కెంపు ధగధగలాడుతున్నది. దాని దిగువ ఎనిమిది అంగుళాల మేర నీలపు రాళ్ళు ఒత్తుగా అమర్చబడి ఉంది, పట్టు బాగా చిక్కటానికి వీలుగా ఉన్నాయి. మిగిలిన పిడి అంతా దంతంతో చేసినది. దాని చివర ఉన్న ముల్లూ, కొక్కెమూ ఉక్కువి. వాటిపైన బంగారు రేకున్నది. వాటి మీద ఏనుగుల బొమ్మలు

అట్ట చివరి బొమ్మ



చిత్రించి ఉన్నాయి. ఆ బొమ్మలే మౌగ్లీని ఆకర్షించాయి. వాటిని చూస్తుంటే హాథీ జ్ఞాపకం వచ్చాడు.

మౌగ్లీ ప్రతి చర్యనూ ఎంతో శ్రద్ధగా గమనిస్తున్న తెల్లపడగ, "ఇదంతా ఒక్కసారి కళ్ళ చూడటానికి ప్రాణాలర్పిస్తే మాత్రం ఏమిటి? నేను నీకు మహోపకారం చేశాను కానూ?" అన్నాడు.

"నా కేమీ అర్థం కావటం లేదు. ఇవన్నీ కఠినంగానూ, చల్లగానూ ఉన్నాయి. తినటానికి పనికిరావు. కాని, ఇది బాగుంది. దీన్ని పట్టుకు పోయి, ఎండలో చూడాలి," అంటూ అంకుశం ఎత్తి చూపించి,



"ఇవన్నీ నీవేనంటావా? దీన్ని నా కిస్తావా? నువు తినటానికి కప్పలను తెచ్చి పెడతాను," అన్నాడు మౌగ్లీ.

తెల్లపడగ క్రూరమైన ఆనందంతో ఉబ్బిపోతూ, "తప్పక ఇస్తాను. ఇక్కడ ఉన్న నిధినిక్షేప మంతా నీదే—నువు వెళ్ళిపోయే దాకా!" అన్నాడు.

"నే నింక వెళ్ళిపోతున్నాను. ఈ చోటు చీకటిగానూ, చలిచలిగానూ ఉన్నది. ఈ ముల్లుకర్రను అరణ్యానికి తీసుకు పోతాను," అన్నాడు మౌగ్లీ.

"అరణ్యానికి తీసుకు పోతావా? సరే.... ముందు, నీ కాలి దగ్గిర అదేమిటో చూడు!" అన్నాడు తెల్లపడగ.

మౌగ్లీ ఒక మనిషి కపాలాన్ని పైకి ఎత్తి, "మనిషి తలఎముక. అక్కడ ఇంకా రెండున్నాయి," అన్నాడు.

"వాళ్ళు కొన్ని ఏళ్ళక్రితం ఈ నిధిని ఎత్తుకు పోదామని వచ్చారు. చీకట్లో నేను వాళ్ళను పరామర్శించాను. తరవాత వాళ్ళు కదలలేదు," అన్నాడు తెల్లపడగ.

"నిధి, నిధి అంటావు. నా కెందు కానిధి? నా కీ ముల్లుకర్ర కావాలి. దీన్ని నా కిచ్చావా వేట సాగాలి. లేకపోయినా వేట సాగాలి. నేను విషప్రాణులతో పోరాడను. మీ వాళ్ల



దగ్గిర నేను అభయమంత్రం కూడా నేర్చుకున్నాను," అన్నాడు మౌగ్లీ.

"ఇక్కడ అభయమంత్రం నా ఒక్కడిదే!" అన్నాడు తెల్లపడగ.

కావా, కళ్ళు జ్యోతుల్లాగా మెరుస్తూ, ముందుకు దూకి, "మనిషిని తీసుకు రమ్మన్నదెవరు?" అని అడిగాడు.

"నే నేఁఅన్నాను. నేను మనిషిని చూసి ఎంతో కాలమయింది. ఈ మనిషి సర్ప భాష మాట్లాడతాడు కూడానూ," అన్నాడు తెల్లపడగ.

"కాని అప్పుడు చంపటం మాట రాలేదు. నేను ఒంటరిగా అరణ్యానికి తిరిగి పోయి, ఇతన్ని మృత్యువుకు అప్పగించి వచ్చానని చెప్పనా?" అన్నాడు కావా.

తెల్లపడగ అహంకారంగా, "చంపటం గురించి ముందుగా మాట్లాడే అలవాటు నాకు లేదు. నువ్విక్కణ్ణించి వెళ్లినా, మానినా, గోడలో సారంగం ఉండనే ఉంది. కోతులను చంపేవాడా, జాస్తిగా మాట్లాడకు. నేను నీ మెడ మీద తాకానంటే చాలు, నువు సాదిలోకి మిగలకుండా పోతావు. ఇక్కడికి వచ్చిన మనిషి ఊపిరితో తిరిగి పోవటమన్నది ఏనాడూ జరగలేదు. నే నీ నగర రాజ నిక్షేపరక్షకుణ్ణి!" అన్నాడు.



"ఓరి పాలిపోయిన చీకటి పురుగా, నేను మళ్ళీ చెబుతున్నాను, విను. నీ రాజూ లేడు, నగరమూ లేదు. మన చుట్టూ ఉన్నది అరణ్యం," అన్నాడు కావా.

"నిధి ఉన్నది గద. పోనీ ఓ పని చేద్దాం. కుర్రాణ్ణి పరిగెత్తమని, నువు వినోదం చూడు, కావా. అటూ ఇటూ పరిగెత్తు కుర్రాడా, ఆడుకుందాం!" అన్నాడు తెల్లపడగ.

మౌగ్లీ కావా నెత్తిమీద నెమ్మదిగా చెయ్యి పెట్టి, రహస్యంగా, "ఈ తెల్లవాడి కింత వరకూ మనిషి మందలో వాళ్ళ సంగతే తెలుసు. నా సంగతి ఎరగడు. వేట కావాలిట వాడికి. ఇద్దాం," అన్నాడు.

అతను తన చేతిలో ఉన్న అంకుశాన్ని చప్పున తెల్లపడగ మెడ మీద పడేటట్టుగా వేశాడు. దాని బరువు కింద తెల్లపడగ కదల లేక పోయింది. మెలికలు తిరుగుతున్న తెల్లపడగ శరీరం మీద కావా దూకి, "చంపు!" అని కేక పెట్టాడు.

మౌగ్లీ కుడిచెయ్యి అప్రయత్నంగా కత్తి మీదికి పోయింది.

"చంపను. ఆకలికి తప్ప ఇంకెన్నడూ చంపను," అని మౌగ్లీ తెల్లపడగను మెడ వెనక పట్టుకుని అతని నోరు కత్తితో వగల దీసి, "చూడు, కావా! బెరడు!" అన్నాడు. తెల్లపడగ పై దవడలో భయంకరమైన విషపు కోరలున్నాయి. కాని చిగుళ్ళు వడిలిపోయి, నల్లగా ఉన్నాయి. వాటిలో విషం వట్టి పోయింది.

మౌగ్లీ తెల్లపడగ మెడ మీది నుంచి అంకుశం ఎత్తి, అతన్ని విడిచి పుచ్చుతూ, "రాజనిక్షేపానికి కొత్త రక్షకుడు రావాలి, బెరడూ. నువ్వు చెయ్యరాని పని చేశావు, బెరడూ. నువ్వే, అటూ ఇటూ పరిగెత్తి ఆడుకో," అన్నాడు.

"ఇంత అవమానం భరించలేను. నన్ను చంపెయ్యి," అన్నాడు తెల్లపడగ.

"నీ చంపటాలతో చాలి వచ్చింది. ఇక ఈ ముల్లుకర్రను నేను పట్టుకు పోతాను. నిన్ను ఓడించాను గద!" అన్నాడు మౌగ్లీ.

"దాని మూలంగా చావు రాకుండా చూసుకో! అది మృత్యువు! జ్ఞాపకం ఉంచుకో! నా నగరంలో ఉండే ప్రతి ఒక్కరికీ సరిపడ్డంత మృత్యువు దానిలో ఉన్నది. అది ఎంతోకాలం నీకు దక్కదు, అడివి మనిషి. నీ దగ్గిర నుంచి లాగుకునే వాడికీ దక్కదు. దాని కోసం హత్యల పరంపర సాగుతుంది. నా శక్తి ఉడిగిపోయింది. ఇక నేను చెయ్యవలిసిన పనిని ఆ అంకుశమే చేస్తుంది. అది మృత్యువు! మృత్యువు! మృత్యువు!" అన్నాడు తెల్లపడగ.



# 78. ముస్తాంగ్ పర్వతగుహలు

ముస్తాంగ్ అనే దేశం నేపాలుకు ఉత్తరంగా ఉన్నది. 750 చదరపు మైళ్ళ విస్తీర్ణం మాత్రమే గల ఈ రాజ్యానికొక రాజున్నాడు. ఇక్కడ అనేకచోట్ల కొండలలో ఇలాటి గుహలు మలిచి ఉన్నాయి. వీటిని మలిచిన దెవరో తెలియదు. ఈ గుహలలోకి ఎక్కాలంటే ఏవైనా సాధనాలు అవసరం.



Photo by T. S. Satyan



బహుమతి
పొందిన వ్యాఖ్య

కళ్ళు కనపడని వాళ్ళు

పంపినవారు,
ఎ. పద్మ, గుంటూరు

Photo by Ravindrakumar Paul



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఒళ్ళంతా కళ్ళు

పంపినవారు :
ఎ. పద్మ, గుంటూరు

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1968 జూలై నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి యైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మే నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: కళ్ళు కనపడని వొళ్ళు

రెండవ ఫోటో: వొళ్ళంతా కళ్ళు

పంపినవారు: ఎ. పద్మ,

కలెక్టర్ ఆఫీస్, గుంటూరు.

బహుమతి మొత్తం రు. 10/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# ముఖ్య గమనిక

'చందమామ' పత్రికకు సంబంధించిన చందాలు, ఏజన్సీ డిపాజిట్లు, ఇరిడెంటు విలువలు, ప్రకటన చార్జీలు మొదలైనవన్నీ క్రింది చిరునామాకు పంపండి.

## డాల్టన్ ఏజన్సీస్,

'చందమామ బిల్డింగ్స్'

వడపళని :: మద్రాసు - 26

## ఊరగాయ పచ్చళ్ళకు అమూల్యమైన నూనెలు

ఎ. యస్. బ్రాండ్

చాయపప్పు నూనె






మెస్సస్ బ్రాండ్

నువ్వులనూనె

ఏజంట్సు :

శ్రీ మాజేటి వీరరాఘవయ్య,
శివాలయం వీధి, విజయవాడ

డిపోలు :

శ్రీ G. సుబ్బారావు,
పుళ్ళక్కి స్ట్రీటు, తెనాలి

శ్రీ B. గోపాలకృష్ణమూర్తి,
1-3-166, రాజా ముదలియార్ స్ట్రీటు
కలాసిగుడ, సికింద్రాబాద్







New




by

**THE NATIONAL TRADING CO.**

Manufacturers of

**KASHMIR SNOW BEAUTY AIDS**

BOMBAY-2. MADRAS-32.

# AWARDS!

# WON PLENTY

## YET WE DON'T SAY
## WE ARE THE BEST

ONLY

## WE DO OUR BEST



**PRASAD PROCESS PRIVATE LTD**

CHANDAMAMA BUILDINGS MADRAS-26

